# ఆంధ్రపత్రిక



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 247 SATURDAY 10th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# సర్దార్‌పటేల్ సలహాపై హైద్రాబాదు సంస్థాన కాంగ్రెసు విభేదాల పరిష్కారం

## అధ్యక్షపదవికి పోటీనుండి రామానందతీర్థ, రామకృష్ణరావుగారల విరమణ

## దిగంబరరావు బిందూను ఎన్నుకోవలెనని నిర్ణయం

హైద్రాబాద్, డిసెంబర్ 8: భారత ఉపప్రధాని సర్దార్ పటేల్‌గారి జోక్యంవల్ల హైద్రాబాద్‌సంస్థాన కాంగ్రెస్‌లో గత 16 నెలలనుండి వుంటున్న విభేదాలు నేటిమధ్యాహ్నం పరిష్కరింపబడి ఉభయపక్షాలమధ్య సమాధానం కుదిరినట్లు ఢిల్లీనుండివచ్చిన వార్తలనుబట్టి తెలుస్తున్నది.

సంస్థానకాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థ, పోటీపక్షనాయకుడు బూర్గుల రామకృష్ణరావుగారలుకలిసి నేడు సర్దార్ పటేల్‌గారిని దర్శించినట్లు తెలుస్తున్నది.

సంస్థానకాంగ్రెస్ అధ్యక్ష ఎన్నికవిషయమై ఉభయపక్షాలకు అంగీకారం కుదిరినట్లుకూడ తెలుస్తున్నది. పోటీనుండి స్వామిరామానందతీర్థ, బూర్గుల రామకృష్ణరావుగారలిరువురూ విరమించవలెననీ, దిగంబరరావు బిందూగారిని సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నుకోవలెననీ నిర్ణయింపబడింది.

# "చైనా అంతర్యుద్ధసమాప్తి"

## ప్రజాసైన్యం దేశభాగ్యోన్నతికి కృషి చేస్తుందని మావ్‌సీ టుంగ్ ప్రకటన

లండన్, డిసెంబరు 8: "చైనా అంతర్యుద్ధంయించుమించు ముగిసినట్లే. ఈ స్వాతంత్ర్య సమరంలో, చైనా ప్రజాసీకానికి అఖండ విజయం చేకూరింది" అని కమ్యూనిస్టుచైనా నాయకుడు మావ్‌సీటుంగ్, తన సైన్యానికి జారీచేసిన ఉత్తర్వులో ప్రకటించాడు.

"అఖండ విజయాన్ని చేపట్టిన ప్రజాసైన్యంలో, శత్రుసంహారానికి యోధోద్ధమాత్రమే నియోగింపబడినారు, మన స్వాతంత్ర్య సైన్యం, సమర నిర్వహణ సైన్యమేగాక, యిక, ప్రజాసౌభాగ్యాభివృద్ధికి కృషిచేస్తుంది. అనేక సంవత్సరాల తరబడి జరిగిన దీర్ఘయుద్ధం మూలంగా, సంభవించిన యిక్కట్టులను అధిగమించి నూతన ప్రజాస్వామ్య వ్యవస్థను స్థాపించుకొనుటకు ప్రజలు సాగించేకృషికి మన సైన్యం తోడ్పడుతుంది" అని మావ్‌సీ టుంగ్ ప్రకటించాడు.

మావ్‌సీటుంగ్ ప్రకటనబట్టి చైనా కమ్యూనిస్టు సైన్యంలో సుశిక్షితులైన, 30 లక్షలమందికమ్యూనిస్టులు,యికఉత్పత్తి కార్యకలాపాలకు వినియోగింప బడుదురని అనుకోవచ్చును.

## ఇండియా పాకిస్తాన్ సరిహద్దు విచారణ

### పాకిస్తాను వాదం

కలకత్తా, డిసెంబరు 8: నేడు ఇండియా పాకిస్తాను సరిహద్దు తగాదా విచారణ స్థానం ఎదుట పాకిస్తాను తరఫు న్యాయవాది మూర్షిదాబాదు - రాజషాహి తగాదా గురించి ఈ విధంగా చెప్పాడు.

"ఇండియా పాకిస్తానుల సరిహద్దు నిర్ణయించిన సర్ సిరిల్ రాడ్‌క్లిఫ్, 1946 ఆగస్టు 15 అనంతరం సరిహద్దు గురించి తగాదాలు అంతర్జాతీయ న్యాయం ద్వారాగాని పరిష్కారం కావని ఎరుగును, ఆయన ఎదుట ఇండియా పాకిస్తానుల వారు నదులను సరిహద్దులుగా ఉంచుకోవడం విషయమై సమగ్రంగా చర్చించారు. నదులు సరిహద్దులుగా ఉంచడం ఆయనకు సమ్మతము యింది. ఆయన కొన్నిచోట్ల నదులనూ, మరికొన్నిచోట్ల నదులున్నప్పటికీ జిల్లాలనూ సరిహద్దులుగా ఏర్పరిచారు. ఆయన నిర్ణయాలను అవగాహన చేసుకోవాలంటే ...

## ఇండియా పొగాకుకు బ్రిటన్‌లో గిరాకీ

లండను, డిసెంబరు 7: ...

... ఈ తర అమెరికానుంచి పుగాకుకొనుక్కోవాలంటే అపరిమితంగావున్న డాలర్లను చెల్లించాల్సివస్తుంది. అందువల్ల వీలైనంతగా స్టెర్లింగ్ ప్రాంతాలలో పుగాకు కొనుక్కోవాలని వారు ప్రయత్నించవచ్చు. డాలర్ ప్రాంతాల పుగాకు తరువాత అంతప్రశస్తమైనది ఇండియాపుగాకే. బ్రిటన్ నిరుటికన్నా ఈ యేడు ఇండియన్‌పుగాకు రెట్టింపు కొన్నది.

## ఫార్మోజాకు చైనా జాతీయ ప్రభుత్వ కార్యస్థానం మార్పు

### నేడోరేపో ప్రస్తుత రాజధాని చెంగ్టూ కమ్యూనిస్టుల వశమయ్యే సూచన

హాంకాంగ్, డిసెంబరు 8: చైనా భూభాగాన్ని వదలి ఫార్మోజాకు తరలిపోవడానికి కోమింటాంగ్ ప్రభుత్వం నిశ్చయించినట్లు ఇక్కడ చెప్పుకుంటున్నారు. ఫార్మోజాలో ఛాంగ్‌కైషేక్‌కు మంచి బలం వుంది. అక్కడ తైపేను రాజధానిగా చెయ్యాలని వీరి ఆశయం అయినట్లుగూడా వార్తలు వస్తున్నాయి.

ఈ సంవత్సరంలో ఇంతవరకు వీరు 4 చోట్లకు తమ ప్రభుత్వాన్ని మార్చారు. ఇప్పుడిది ఐదవది, కాని ఇంకా ఎప్పుడు వీరు ఫార్మోజాకు తరలిపోయేది నిశ్చయం కాకపోయినా, చాంగ్‌కైషేక్ మాత్రం ఇవ్వాళ ఉదయమే ఛాంగ్టూనుండి ఫార్మోజాకు పోయినట్లు అక్కడనుంచి ...

## పాకిస్తాన్ కమ్యూనిస్టుపార్టీ కార్యాలయంపై దాడి

లాహోర్, డిసెంబర్ 8: ...

## చైనాలో ప్రమేయంవద్దు

### సర్వసభ్యసమావేశతీర్మానం

... (2వ పేజి చూడుడు)

## తపాలాబిళ్లలపై భారత రిపబ్లిక్ అధ్యక్షుని చిత్రాన్ని ముద్రించరు

న్యూఢిల్లీ, డిసెంబరు 8: ...

# డిసెంబరు 21 నుండి పని ముగిసేవరకూ రోజూ సమావేశమవడానికి విభజనసంఘ నిర్ణయం

## ఆర్థిక, సిబ్బంది ఉపసంఘముల ఏర్పాటు

మదరాసు, డిశంబరు 9: చెన్నరాష్ట్ర విభజన సంఘం నేడుకూడ సెంటుజార్జి కోటలో మంత్రివర్గ మందిరమున ప్రధాని శ్రీ కుమారస్వామి రాజాగారి అధ్యక్షతను సమావేశమై ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సంబంధించిన మరికొన్ని సమస్యలను చర్చించెను. రెండు రాష్ట్రములమధ్య ఆస్తి అప్పుల విభాగమును గురించి కొంతవరకు వివరముగా ప్రభుత్వ ఆర్థిక కార్యదర్శి శ్రీ టి. యన్. యస్. రాఘవన్ విభజనసంఘము నిర్ణయములు చేయుటకు అవసరమగు భోగట్టా ఇవ్వవలసిన అంశములు చర్చించిరి.

ఇండియా ప్రభుత్వమువారి సూచననుసరించి విభజనసంఘమునకు అవసరమగు విషయములను సేకరించి అంచనాలు ఇచ్చుటకుగాను ప్రవీణులతో కూడిన రెండు ఈ దిగువ ఉపసంఘములను నియమించిరి.

### ఆర్థిక ఉపసంఘము

(1) శ్రీ టి. యన్. యస్. రాఘవన్ ఐ. సి. యస్. ఆర్థిక కార్యదర్శి.
(2) శ్రీ యస్. వెంకటేశ్వరన్ ఐ. సి. యస్. పబ్లిక్ డిపార్టుమెంటు అడిషనల్ కార్యదర్శి.
(3) శ్రీ ఓ. పుల్లారెడ్డి ఐ. సి. యస్. ప్రభుత్వ హోంశాఖ కార్యదర్శి.

### సిబ్బంది, ఉద్యోగుల ఉపసంఘం

(1) శ్రీ కె. రామునిన్ ఐ. సి. యస్. ...

ఈ ఉపసంఘములు సేకరించిన వివరములు, వారి సూచనలను 21వ తేదీన జరుగు విభజనసంఘ సమావేశములోగ అందజేయవలెననికూడ కోరిరి. డిశంబరు 21 నుండి విభజనసంఘము ప్రతిరోజూ విభజన కార్యము ముగియువరకు సమావేశమవుతూ వుండగలదు.

### స్థిరచరాస్తుల విభజన

మదరాసు, డిశంబరు 8: మదరాసు రాష్ట్రమునుండి ఆంధ్రరాష్ట్రమునకు స్థిరచరాస్తులలో షుమారు 40% రాగలదని ఎంచబడుచున్నది.

ఆయాప్రాంతములలోని ప్రభుత్వ వ్యవస్థలు, భవనములు వగైరా ఆయారాష్ట్ర ...

# ఆంధ్రలో 30 లక్షల కాంగ్రెస్‌ప్రాథమికసభ్యత్వం

విజయవాడ, డిసెంబరు 9: ఆంధ్రదేశములో గల జిల్లా లన్నిటిలోను యీ సంవత్సరం మొత్తం దాదాపు 30 లక్షలమంది కాంగ్రెస్ ప్రాథమిక సభ్యులుగా చేరినట్లు ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ కార్యాలయానికి వచ్చిన వార్తలనుబట్టి తెలుస్తున్నది. ఇంతవరకు ఆయాజిల్లాల నుండి వచ్చిన వివరాలిట్లున్నవి.

ఉత్తరవిశాఖ 157 వేలు. దక్షిణవిశాఖ 127 వేలు. తూర్పుగోదావరి 140 వేలు. పశ్చిమగోదావరి 118 వేలు. పశ్చిమకృష్ణా 282 వేలు. తూర్పు కృష్ణా 113 వేలు. గుంటూరు 716 వేలు. నెల్లూరు 321 వేలు. చిత్తూరు 112 వేలు. బళ్ళారి 27 వేలు. అనంతపురం 75 వేలు. కర్నూలు 144 వేలు.

## సెమొలినా కొరత

చెన్నపట్నం, డిశంబరు 7: సెమొలినా నిల్వలు తక్కువగా వుండుటవల్ల సెమొలినా సరుకు లేనిచోట్లలో ఆ రెండు ఔన్సులకు బదులు గోధుమలు మైదా వరి లేక బ్రెడ్ టికెట్లు యివ్వవలెనని సివిల్ సప్లయిస్‌శాఖ ఉత్తరవు చేసినది.

## కిరసనాయిలు: భారత దేశోత్పత్తి

ఢిల్లీ, డిసెంబరు 8: నేడు ఇండియా పార్లమెంటులో మానో మోహనదాస్ దారు అడిగినప్రశ్నకు సమాధానముగా పబ్లికువర్క్స్ శాఖామంత్రి యన్. వి. గాడ్గిల్ గారు యిట్లుగోప్పిరి.

1949 సం॥ జనవరి మొదలు ఆగస్టు వరకు 3,88,737 టన్నుల పెట్రోలున్ను 4,11,864 టన్నుల కిరసనాయిలున్ను ఇండియాకు దిగుమతి చేయబడెను. 1949 సం॥ మొదటి 8 మాసాలలోను భారతదేశమందు ఖర్చుఅయిన పెట్రోలులోను కిరసనాయిలులోను నూటికి 6.8 వంతు భారతదేశములో ఉత్పత్తి చేయబడినటువంటిదే.

# కృష్ణాజిల్లాకు రెండవ పంట నీటిసప్లయి వీలుకాదు

## పబ్లిక్‌వర్క్సు మంత్రి ప్రకటన

మదరాసు, డిశంబరు 9: బకింగ్‌హాం కాల్వకు ...

... నీరు ఇప్పించవలెనని సూచించిరి. ఈ సూచన పరిశీలించెదమని అప్పుడే చెప్పినాను. ఇక్కడకువచ్చి పరిశీలించితిని. కృష్ణాజిల్లాలో ప్రస్తుతము 2 వేల యకరములకు రెండవ పంటకు నీరు ఇవ్వబడుచున్నది. ఇప్పుడు 50 వేల యకరములకు నీరు అవసరము. పడవల రాకపోకలకు ఇబ్బంది కలిగించి బకింగ్‌హాం కాల్వ నీరును ఇచ్చినా 2 వేల యకరములకు ...

# వ్యవసాయకూలీల కనీసవేతనాల పరిశీలన: కేంద్రప్రభుత్వ నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబర్ 8: 1948 కనీస వేతనాల చట్టంకింద వ్యవసాయకూలీల కనీస వేతనాలు నిర్ణయించే నిమిత్తమై కేంద్ర ప్రభుత్వంవారు దేశంలో వ్యవసాయఖర్చులను గురించి విచారణజరపడానికి నిర్ణయించారు. దీనికిగాను 4 లక్షలు ఖర్చవుతుందట.

1951 మార్చిలోగా వ్యవసాయకూలీల వేతనాలు ఏర్పాటుచేసే నిమిత్తమై దేశమంతటా అనేక గ్రామాలలో శ్రామికశాఖవారు నడుపుతున్న విచారణలో ఇదొక భాగం. ఈవిచారణ వెయ్యి గ్రామాలలో జరపబడుతుంది. ప్రస్తుతం 500 గ్రామాలలో జరుగుతున్నది.

వ్యవసాయ కూలీకుటుంబ ఖర్చులు, ఆదాయ, అప్పు, జీవనవ్యయం, ఇంటి అద్దె, ఆరోగ్యం వగైరాలు, కుటుంబం, రాబడి అవకాశాలు, పొలాలువగైరాలు తెలుసుకోబడతవి.

## క్షయ చికిత్స శిక్షణ కేంద్రాలు

### ఇండియాలో మూడు స్థాపింప నిర్ణయం

మదరాసు, డిసెంబర్ 8: క్షయరోగం కనుగొని సకాలంలో సరిగా చికిత్సచేయుటకు వైద్యులకు శిక్షణయొసంగు కేంద్రాలు మూడింటిని ఇండియాలో 1950 సం॥ నందు స్థాపించెదరు. ఢిల్లీలోనొకటి, పాట్నాలో నొకటి, తిరువేంద్రములో నొకటియని, ప్రపంచ ఆరోగ్యసంస్థ తరఫున ఆ సంస్థయొక్క క్షయశాఖ అధికారి డా॥ జె. బి. మాక్డూగలు గారు నిన్న సాయంకాలం మదరాసు వైద్యకళాశాల ...

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ పంచమి 1949 సం॥డిసెంబరు 10 శనివారం
శ॥ పంచమి రా 10-7 పుష్య ఉ 6-47 వర్జ్యం సా 7-33 ల 9-9 కు.
బ॥ షష్ఠి డిసెంబరు 11 ఆదివారం
ఆ॥ షష్ఠి రా 9-17 ఆర్ద్ర ఉ 6-47 వర్జ్యం సా 6-36 ల 8-11 కు.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ మార్గశిర బ॥ పంచమి
శనివారం

## చైనా ఫిర్యాదుపై సమితి తీర్మానం

సోవియట్ రష్యా 1945 వ సంవత్సరములో తమ ప్రభుత్వముతో చేసుకొని యుండిన మైత్రి ఒడంబడికకు విరుద్ధముగ చైనా అంతర్యుద్ధమున కమ్యూనిస్టు సేనలకు సహాయముచేసి చైనా గృహావ్యవహారములందు జోక్యము కల్గించుకొనుచుండెనని ఐక్యరాజ్యసమితి రాజకీయ సంఘమునందు చైనా ప్రభుత్వ ప్రతినిధి చేసిన ఫిర్యాదును 'చిన్నసమితి' విచారింపవలెనని ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశము పరిష్కరించివేయుట వలన 'చైనా సమస్య' పరిష్కారము సుకరము కాలేదు. చైనాలో పరిస్థితులు పూర్తిగ విషమించి, చైనా అంతటిపై కమ్యూనిస్టు ఆధిపత్యము స్థిరపడనున్న సమయములో చైనా ప్రతినిధివర్గ నాయకుడు సోవియటురష్యాపై ఫిర్యాదు చేయుటయు, సమితి ఈ విషయమును చర్చించుటయు జరిగినది. ప్రస్తుత పరిస్థితులలో ఐక్యరాజ్యసమితి సోవియట్ రష్యా చైనాతో నాలుగు సంవత్సరముల క్రితము చేసుకొని యుండిన ఒడంబడికను ఉల్లంఘించినదని తీర్పు నిచ్చుటకంటె చైనా పరిస్థితులను చక్కబెట్టి, దేశమున సుస్థిర ప్రజాస్వామిక ప్రభుత్వమును నెలకొల్పుటకు విఫలప్రయత్నములు జరుపుటకంటె చేయగల దేమియులేదు.

చాంగ్‌కై షేక్ ప్రభుత్వము ఆరుమాసముల క్రితము కమ్యూనిస్టులు యుద్ధమును తీవ్రతరము చేసినప్పటినుండియు ఇప్పటికి నాల్గు పర్యాయములు తమ రాజధాని నగరమును మార్చుకొనుచు ఇపుడు చైనా భూభాగము నె వదలి ఫర్మోజా దీవికి తరలిపోవలసివచ్చెను. ఇందువలన దాదాపు చైనా భూభాగమంతయు కమ్యూనిస్టులవశమైనట్లు అంగీకరింపవలసియుండును. ఈ పరిణామమునకు కారణములు ఏమి, బాధ్యులెవరు? అను విషయమై ఇపుడు జరుపు విచారణ శవపరీక్షగ మాత్రమె యుండగలదు. కనుకనె ఐక్యరాజ్యసమితి కూడ చైనా జాతీయ ప్రభుత్వ ఫిర్యాదుపై దీర్ఘచర్చ జరిపి తీర్పునిచ్చుటకు బదులు ఈ ఫిర్యాదును 'చిన్నసమితి'విచారింపవలెనని తీర్మానించియుండెను. ఈ సమితిని సోవియటురష్యావర్గము మొదటినుండియు బహిష్కరించెను. కనుక ఈ వుపసమితి నిర్ణయములు రష్యానుగాని, కమ్యూనిస్టు చైనానుగాని బంధింపజాలవు. నేను గాకున్నను, మరి కొంత కాలమునకైనను ఇతర ప్రజాస్వామిక రాజ్యములు కమ్యూనిస్టు చైనా ప్రభుత్వమును గుర్తింపక తప్పదు. ఐక్యరాజ్యసమితియందు చేర్చుకొనకను తప్పదు. ఈ విధముగ పరిస్థితులె చైనా సమస్యను పరిష్కరించి వేయును.

చైనావిషయమున సమితి సర్వసభ్య సమావేశము చేసిన రెండవ తీర్మానము మాత్రము ఒక్క చైనాకే గాక, ప్రపంచ రాజ్యము లన్నింటికి సంబంధించి యున్నది. చైనా వ్యవహారములలో ఇతర దేశము లేవియు ప్రమేయము పెట్టుకొనరాదను ఈ తీర్మానము ముఖ్యముగ రష్యా నుద్దేశించియే జరిగినదని భావింపవలసియుండును. సోవియట్ రష్యా ప్రపంచమునందలి అన్ని దేశముల వ్యవహారములలోను ఆయాదేశములందలి కమ్యూనిస్టు పక్షముల ద్వారా ప్రమేయము కల్గించుకొనుచునే యున్నది. ఇట్టి చర్యలను అరికట్టకపోయిన పక్షమున అనేక దేశములు చైనా మార్గమును అనుసరించిపోకతప్పదు. ఐక్యరాజ్యసమితి చైనా విషయమున ఇట్టి తీర్మానములు చేయుటతో తృప్తిచెందక, ఇట్టి ప్రమేయమును అరికట్టుటకు అవసరమైనచర్యలు తీసుకొనవలసి యుండును. చైనా పరిస్థితి ఇతర ప్రజాస్వామిక రాజ్యముల సంఘటితపరచి ప్రజాస్వామ్యము, స్వాతంత్ర్యముల రక్షించుటకుఅవసరమైన చర్యలు తీసుకొనుటకు సమితిని ప్రోత్సహింపవచ్చును.

## ఇండియాకు నార రవాణా: పాకిస్థాన్ అటకాయింపు

బొంబయి, డిసెంబరు 8: 5 లక్షల బేళ్ళ ముడి జనపనారను ఎక్కించుకొని, ఇండియాకు ప్రయాణమవబోతున్న పడవలను, పాకిస్థాన్ ప్రభుత్వం అటకాయించి, సదరు సరకు ఇండియాకు రవాణాకాకుండా నిలిపి ఉంచిందని, ఇక్కడకు చేరిన వార్తలనుబట్టి తెలుస్తున్నది. ఈముడినార ఖరీదు కొన్ని కోట్లరూపాయలుండవచ్చుననికూడా తెలుస్తున్నది.

ఈ నారనుకొనుటకు కంట్రాక్టు, ద్రవ్యమారకం విలువలలో మార్పురాకముందే జరిగినదని, డబ్బుకూడా ఇదివరలో చెల్లించడమైనదని తెలుస్తున్నది.

గతవారం, ఇండియా నారమిల్లుల ప్రతినిధులు ఢక్కావెళ్లి, పాకిస్థాన్ నార క్రయసంఘంతో, యీ విషయం మాట్లాడారు, పాకిస్థాన్ తనరూపాయ మారకం విలువను మార్చకుండుట నిర్ణయించుకొనే పూర్వమే, తాము క్రయంచేసిన సరకుడబ్బుచెల్లించామని, కాబట్టి కంట్రాక్టు అమలు జరపాలని పడవలలో ఎక్కించిన నార బేళ్ళను, ఇండియాకు వెంటనే రానివ్వకపోతే, నష్టం వాటిల్లుతుందని, పాకిస్థాన్ నారక్రయ సంఘానికి వారు చెప్పకున్నారు.

న్యాయశాస్త్రరీత్యాగాని నైతిక ధర్మసూత్రాలరీత్యాగాని, చేయవలసిన దేమైనప్పటికి యీ నార బేళ్ళను తాము విడుదల చేయజాలమని, ద్రవ్య మారకం విలువల తగాదా పరిష్కరమయ్యేవరకూ నార బేళ్ళను ఇండియాకు రవాణాచేయుటకు తమ ప్రభుత్వం ఒప్పుకోదని, పాకిస్థాన్ నారక్రయ సంఘంవారు, ఇండియన్ నార మిల్లుల ప్రతినిధులకు సమాధానం చెప్పారట. పడవలలో ఎక్కించిన నారను దింపి వేయవలసిందిగా నౌకా కంపెనీ (వీటిలో చాలా బ్రిటిష్ కంపెనీలు) కు ఉత్తర్వు చేశారు. కాని తమ కిరాయి అదివరకే చెల్లింపబడి ఉండటంచేతనూ, అదిగాక, నారను నిల్వచేసి ఉంచుటకు గిడ్డంగులు లేకపోవడంచేత తమ పడవలనుంచి నారను దింపేదిలేదని, నౌకా కంపెనీలు,పాకిస్థాన్ నార సంఘంవారికి జవాబు చెప్పినవి.

## ఉక్కుధర తగ్గింపు: మత్తయి ప్రకటన ఫలితం

బొంబాయి, డిసెంబరు 8: ముడి ఇనుమురలాగానే ఉక్కుధరను కూడా నూరింట 7 వంతులు తగ్గించాలని ప్రభుత్వం యోచిస్తున్నదని ఆర్థికశాఖామంత్రి డా॥ జాన్ మత్తయ్ నిన్న పార్లమెంటులో చేసిన ప్రకటన అపార్థాలకు దారితీసింది. కొందరు అనుభవంలేని వాటా దారులు ఉక్కు కోసుధరకు ఈమాట అన్వయిస్తుందని అపార్థం చేసుకొని, బొంబాయి స్టాక్ ఎక్స్చేంజిలో తమకున్న వాటాలన్నీ గబగబా అమ్మేసుకున్నారు. కాని సంగతి సందర్భాలన్నీ ఎరిగి ఆరితేరిన వ్యవహారవేత్తలెవరూ డా॥ మత్తయ్ ప్రకటన అపార్థం చేసుకోలేదు.

## ఆసియా దేశాల ఆర్థికస్థితి పరిశీలన

### పారిశ్రామికంగా జపాన్, భారతదేశాల అభివృద్ధి

న్యూఢిల్లీ, డిసెంబరు 8: 1948 లో ఆసియాలో ఆర్థిక సాంఘిక పరిస్థితులు ఎలాఉన్నదీ సమీక్షచేస్తూ, అంతర్జాతీయ కార్మికసంస్థ డైరెక్టరు జనరలు డేవిడ్ ఏ. మోర్సు ఒక నివేదిక తయారు చేసెను.

జనవరిలో సిలన్‌లో నువారావద్ద జరగనున్న అంతర్జాతీయ కార్మికసంస్థ ఆసియా ప్రాంతీయ మహాసభలో ఈ నివేదిక చర్చకు రానున్నది. ఆసియాలో జనసంఖ్య నిముష నిముషానికి పెరిగిపోతున్నదనీ, ఐక్యరాజ్యసమితి ఈ జనసంఖ్య అభివృద్ధినికూడా లెక్కలోకి తీసుకొని సాంకేతిక సహాయం త్వరత్వరగా చేయాలనీ, మార్సు ఆ నివేదికలో ఉద్ఘాటించెను.

జనాభా మితిలేకుండా పెరిగిపోవడం వల్ల వాణిజ్యపంటల కిందనున్న భూమిని కూడా ఆహారపంటలకిందికి మార్చవలసి వస్తున్నదనీ, ఇందువల్ల విదేశద్రవ్యాదాయం పూర్తిగా తగ్గిపోయి, పారిశ్రామికాభివృద్ధి వెనకబడుతున్నదనీ, ఆయన వివరించెను. అధిక ద్రవ్యోల్బణంకూడా ఏర్పడి ఉండడంవల్ల ఏరిచేతులలోను వెనకవేసుకోడానికి డబ్బు మిగలకుండా పోతున్నదనీ, అందుచేత పెట్టుబళ్లుకూడా సన్నగిలి పోయినవనీ నివేదిక చెబుతున్నది. జపానులో పారిశ్రామికోత్పత్తి నిరుటికన్న నూటికి 34 వంతులు పెరిగిందనీ, కాని ఇండియాలో ఉత్పత్తి జపానులో అంత పెరగలేదనీ మార్సు వ్రాసెను. ఫిలిప్పీన్సులోకూడా ఉత్పత్తి బాగానే పెరిగింది. మొత్తంమీద ఆసియాఅంతటా పరిస్థితి యుద్ధాత్పూర్వంకన్న కొంతవరకు బాగు పడ్డదనే చెప్పవచ్చును. కాని ఆసియా అంతటా తిండికొరతవల్ల ప్రజల కిప్పుడు మునుపటికన్న బాగా తక్కువ కాలరీల విలువగల ఆహారం లభిస్తున్నది."

## ఫార్మోజాకు చైనాప్రభుత్వం మార్పు

1 వ పేజి తరువాయి

చేశారు. 16 మంది తటస్థంగా వున్నారు.

చైనా రాజకీయ స్వాతంత్ర్యాన్నీ అంతా గౌరవించాలన్న ప్రతిపాదనకుఅనుకూలంగా 45 ఓట్లు వచ్చాయి.

సోవియట్ రష్యా, దాని ఉపగ్రహాలు ఈ తీర్మానాన్ని వ్యతిరేకించాయి. అసలు వారు ఈ తీర్మానంమీద చర్చ జరుగుతూవుండగా అందులో పాల్గొనలేదు.

రష్యా చైనా విషయంలో అనవసరంగా ప్రమేయం కల్పించుకొని దాని రాజకీయ స్వాతంత్ర్యానికి, భౌగోళికమైన గౌరవమర్యాదలకు భంగం వాటిల్లచేస్తోంది అని తీర్మానంలో ఆతురాలా వున్నా, ఈ విషయాన్నిగూర్చి సమగ్రపరిశీలన గావించకల అధికారం ఉపసమితికి దఖలు చేయబడింది.

ఈ పరిశీలన అనంతరం ఈ సమస్యను భద్రతాసంఘం విచారణకు పంపాలని ఆ ఉపసమితి భావించేపక్షంలో, అట్లాచేయవలసిందిగా కోరుతూ, అది సమితి ప్రధాన కార్యదర్శిని కోరవచ్చును.

## కమ్యూనిస్టు చైనా పరగణన

### వచ్చేవారంలో బ్రిటన్ ఒక నిర్ణయానికి రావచ్చును.

లండన్, డిసెంబరు 8:—కమ్యూనిస్టు చైనా ప్రభుత్వాన్ని గుర్తించే విషయంలో బ్రిటన్ వచ్చేవారంలో ఒక నిర్ణయానికి రాగలదని అభిజ్ఞులు పేర్కొంటున్నారు.

బ్రిటన్ ఎప్పుడుపెకింగ్ ప్రభుత్వాన్ని గుర్తిస్తుంది అనేది ఇతర కామన్‌వెల్తు రాజ్యాల సహకారంమీద ఆధారపడి వుంటుందని గూడా వీరు అంటున్నారు.

డిశంబరు 10 వ తేదీ నాడు ఆస్ట్రేలియాలో జరిగిన ఎన్నికల ఫలితాలు ప్రకటితం అవుతాయి. అప్పుడు గాని చైనా విషయంలో కామన్‌వెల్తు భావం ఎల్లా వున్నది విస్పష్టంగా తేలదు. ఈలోగా బ్రిటిష్ విదేశాంగ మంత్రి బెవిన్, కామన్‌వెల్తు హై కమిషనర్లతో ఈ విషయమై చర్చలు సాగిస్తున్నారు.

## "ఢిల్లీలో ఇండ్ల వసతుల రేషనింగ్ అసాధ్యం"

ఢిల్లీ, డిసెంబరు 8: నేడు ఇండియా పార్లమెంటులో లక్ష్మీనారాయణ సాహు గారు అడిగినప్రశ్నకు ఇండియా ప్రభుత్వ పబ్లికువర్క్సుశాఖా మంత్రి యన్. వి. గాడ్గిలుగారిట్లు బదులు చెప్పిరి.

ఢిల్లీలో ఇండ్ల వసతులు అద్దె యిండ్లు చాలా తక్కువగా ఉన్నందున ఉన్న యిండ్లను వసతులను గవర్నమెంటు కంట్రోలుచేసి రేషనుపద్ధతిగా ప్రజలకు సమకూర్చవలెనను విషయమై ఇండియా గవర్నమెంటు ఆలోచించినది. కాని అట్టిది సుసాధ్యం కాదని విరమింపబడెను.

# అడ్మిరల్ నిమిట్జ్‌నే మధ్యవర్తిగా నియమించే సూచన

## కాశ్మీర్ కమిషన్ నివేదిక భద్రతామండలికి అందినది

లేక్‌సక్సెస్, డిసెంబర్ 9: కాశ్మీర్ సమస్యపై ఇండియా, పాకిస్థాన్లకు సమాధానం కుదర్చేనిమిత్తం ఒకే ఒక వ్యక్తిని మధ్యవర్తిగా నియమించవలసినదని కాశ్మీర్ మధ్యవర్తిసంఘం వచ్చేవారంలో భద్రతామండలికి సూచించవచ్చునని తెలుస్తున్నది.

జనవాక్య నిర్వాహకుడుగా నియమితుడయిన అడ్మిరల్ నిమిట్స్ తాను మధ్యవర్తి సంఘ నివేదిక యొక్క సారాంశాన్ని చూశానని వెల్లడించాడు. కాని దాని మీద ఏమీ వ్యాఖ్యానించలేదు.

తాత్కాలిక ఒడంబడిక నొకదానిని చేసుకునేట్లు ఉభయ పక్షాలనూ ప్రోత్సహిస్తూ తాము చేసిన ప్రయత్నాలు ఎట్లా విఫలమైనదీ మధ్యవర్తి సంఘం ఆ నివేదికలో వివరించిందనీ, ఒకే ఒక ప్రముఖ వ్యక్తిని మధ్యవర్తిగా నియమించమని సూచిస్తుందనీ తెలుస్తున్నది. అంటే అడ్మిరల్ నిమిట్స్‌నే నియమించాలని ప్రతిపాదించవచ్చునని ఇక్కడ అర్థం చెప్పబడుతున్నది.

## కాశ్మీర్ వివాదంపై భద్రతామండలి చర్చ

### లేక్‌సక్సెస్‌కు బాజ్పాయ్ ప్రయాణం

న్యూఢిల్లీ, డిసెంబర్ 8: భారత ప్రభుత్వ విదేశాంగ శాఖాకార్యదర్శి, సర్. గిరిజా శంకర్ బాజపాయ్ ఈ వేళ న్యూఢిల్లీనుంచి లేక్‌సక్సెస్‌కు ప్రయాణమైనారు. వీరు ఐక్యరాజ్యసమితిలో జరిగే కాశ్మీర చర్చలో పాల్గొన బోతున్నారని తెలుస్తున్నది.

షేక్ మహమ్మద్ అబ్దుల్లాకూడా ఈ వేళ లేక్‌సక్సెస్‌కు బయలుదేరి ఉండవలసిందేగాని కాశ్మీరంలో అత్యవసర వ్యవహారాలవల్ల ఆగిపోయారని తెలుస్తున్నది.

లేక్‌సక్సెస్‌కు కాశ్మీర దేశీయశాఖలో సహాయమంత్రిగా ఉంటున్న డి.పి. ధార్ కూడా ప్రయాణమవుతున్నారు. ఈయన షేక్ అబ్దుల్లాకు కుడిభుజంవంటివారనీ, ఈయనవయస్సు 29 సంవత్సరాలేననీ తెలుస్తున్నది. ఈయన ప్రయాణమయ్యేముందు పి. టి. ఐ. విలేఖరితో మాట్లాడుతూ ఇన్నాళ్ల నించీ కాశ్మీరానికి చాలా అన్యాయం జరిగిందనీ, ఈపైన వెంటనే కాశ్మీర విషయంలో న్యాయం చెయ్యవలసిందని భద్రతాసంఘాన్ని కోరుతున్నామనీ చెప్పారు.

ఈ విషయంలో డి. పి. ధార్ ఇంకా ఇల్లాగ అన్నారు. "రెండు సంవత్సరాల క్రితం షేక్ అబ్దుల్లా భద్రతాసంఘానికి వెళ్లి, పాకిస్థాన్ చేస్తున్న ఘోరకృత్యాలు ప్రపంచ దేశాలన్నిటికీ తెలియజేశారు. కాని ఆ సమయంలో ఆయనమాట లెవరూ విశ్వసించలేదు. ఈవేళ ఐక్యరాజ్యసమితి ఏర్పాటు చేసిన కాశ్మీరసంఘం చెప్పినదాన్నిబట్టి, షేక్ అబ్దుల్లామాటలు అక్షరాలా నిజంఅని అందరికీ తెలిసింది.

అప్పుడు ఐక్యరాజ్యసమితి కాశ్మీరానికి న్యాయం చెయ్యడంలో చాలాఆలస్యం చేసింది. ఇప్పుడు పరిస్థితులన్నీ స్పష్టంగా తెలిశాయికాబట్టి కాశ్మీరానికి న్యాయం జరగడంలో ఆలస్యం కాకూడదు."

ధార్ ఇంకా మాట్లాడుతూ, కాశ్మీరం జనవాక్య నిర్ధారణ జరిపించడానికి తయారుగా ఉన్నదనీ, కాశ్మీర సంస్థానానికి తన భూభాగంమీద అంతటా సంపూర్ణమైన స్వాతంత్ర్యం ఉండాలనీ, పాకిస్థాన్‌నించి కాశ్మీర్‌పై దండెత్తివచ్చిన వారి నందరినీ తిరిగి పంపించి వెయ్యాలనీ, అంతవరకూ నిష్పక్షికమైన జనవాక్య నిర్ధారణ జరగడానికి అవకాశం ఏర్పడదనీ చెప్పారు.

ఈ విషయంలో ఆయన ఇంకా ఇల్లాగ అన్నారు. "పాకిస్థాన్ సైన్యాలను కాశ్మీరాన్నించి తొలగించే విషయంలో రాజీకి ఎంతమాత్రము అవకాశంలేదు. పాకిస్థాన్ అనవసరంగా కాశ్మీరంలో ప్రవేశించింది. పాకిస్థాన్ సైన్యాలు పూర్తిగా కాశ్మీరంనించి వైదొలిగేతేనే గాని, కాశ్మీర ప్రజల జనవాక్య నిర్ధారణకు సావకాశం ఏర్పడదు."

సర్ గిరిజా శంకరబాజ్‌పాయ్ ఈ వేళ ఢిల్లీనుంచి బొంబాయివచ్చారు. కాశ్మీర వివాద విషయంలో ఐక్యరాజ్యసమితిలో ఇండియాతరఫున ప్రతినిధిగా వ్యవహరిస్తున్న సర్ బెనిగాల్ నరసింగరావుగారికి గిరిజాశంకర్ బాజ్‌పాయ్ తోడ్పడి గలరని తెలుస్తున్నది. సర్ గిరిజా శంకర్‌వెంట డాక్టరు బి. రాజన్, డి. పి. ధార్ లు కూడా ఉన్నారు. డాక్టరు రాజన్ ఇండియా రాయబారవర్గానికి కార్యదర్శిగా ఉంటారు. వీరందరురేపు శుక్రవారంనాడు లండన్ బయలుదేరి వెళ్ళి అక్కడనించి అమెరికాకుపోగలరని తెలుస్తున్నది.

## లియాఖత్ ఆలీఖాన్ ప్రకటన

కోహాట్, డిసెంబర్ 8: కాశ్మీర్ సమస్యా పరిష్కారం విషయం ఓపిక వహించడం మంచిదని, పాకిస్థాన్ ప్రధాని లియాఖత్ ఆలీఖాన్ యిక్కడ ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తూ ప్రజలకు సలహా యిచ్చాడు.

ఏమైనాసరే కాశ్మీర్‌ను బలవంతంగా కలుపుకొనుటకు ఇండియా చేసే ప్రయత్నాన్ని పాకిస్థాన్ ప్రభుత్వం సహించదు" అని లియాఖత్ హామీ యిచ్చాడు. సంఘర్షణలు పెట్టుకోకుండా ఇండియా పాకిస్థాన్ తగాదాలను శాంతంగా పరిష్కరించుకోవాలని నెహ్రూ, యిటీవల అన్న మాటలను ఉదహరిస్తూ, కాశ్మీర్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకోవాలనే ఉద్దేశ్యం నిజంగా నెహ్రూకు ఉంటే, ఆయన తన మాటలను కార్యరూపేణా నిరూపించాలి" అని పాక్ ప్రధాని అన్నాడు.

జమ్మూ కాశ్మీర్ సంస్థానంలో న్యాయమైన నిష్పక్షికమైన జనవాక్యం తీసుకొని, తన వాగ్దానాలను నెహ్రూ నెరవేర్చుకోవాలి. కాశ్మీర్‌సమస్యా పరిష్కారం కానంతవరకూ అంతరధిని వేళ సామరస్యం అసాధ్యం" అని లియాఖత్ ఆలీఖాన్ అన్నాడు.

## గనుల కార్మికుల శాసన సవరణ

### పార్లమెంటులో ప్రతిపాదన

న్యూఢిల్లీ, డిశంబర్ 8: గని కార్మికులకు రక్షణనివ్వటానికీ, కార్మికుల స్థితిగతులను క్రమబద్ధం చేయటానికీ, కార్మిక మంత్రి జగజీవన్ రామ్ గారు, ఈవేళ పార్లమెంటులో 1923 ఇండియన్ మైన్సు చట్టానికి ఒక సవరణ ప్రతిపాదించారు. ఈ సవరణయొక్క ముఖ్యాశయాలు: (1) గనుల లోపలా బయటా పనిచేసే కార్మికుల పనికాలాన్ని వారానికి 48 గంటలకు తగ్గించటం. (2) జీతంమీద యియ్యవలసిన సెలవులు పగైరా నిర్ణీతంచేయటం. (3) కార్మికులుచేసే అదనపు పనికి, గనుల లోపల చేసేపనికి రెండురెట్లుగానూ, గనుల బయటచేసే పనికి $1\frac{1}{2}$ రెట్లుగానూ నిర్ణీతంచేయటం. (4) పిల్లలను గనులలోని యే భాగంలోనూ పనిచేయించకుండా నిర్ణీతంచేయటం. (5) స్త్రీ కార్మికులను రాత్రివేళ పనిచేయించకుండా నిరోధించటం (స్త్రీ కార్మికులనే గనులలో ఏ విభాగంలో పనిచేయు పద్ధతిని లోగడనే నిషేధించారు.

ఈ బిల్లుగనుక చట్టంగా అంగీకరింపబడితే 1948 ఫ్యాక్టరీ చట్టంతో బరోబరిగా వుంటుంది

## ఇండియాలో పాకిస్థాన్ వ్యాపార కమిషనర్

కరాచీ, డిసెంబరు 8: భారత దేశములో పాకిస్థాను వాణిజ్య కమిషనరును నియమింప పాకిస్థాను ప్రభుత్వము నిర్ణయించినది. పాకిస్థాను వాణిజ్య ఒడంబడికలు చేసి కొన్ని దేశములన్నిటిలోను గూడ అనగా బ్రిటను, ఫ్రాన్సు, జెకోస్లొవేకియా, పోలెండు, బెల్జియమ్ జపానులలో గూడ ట్రేడ్ కమిషనర్లను నియమింప పాకిస్థాను నిర్ణయించినట్లు తెలియుచున్నది. ఇటలీ, హంగరీ, రష్యా, ప. జర్మనీలతో యిట్టి వాణిజ్య ఒడంబడికలు చేసికొనటకు పాకిస్థాను రాయబారములు జరుపుచున్నది.

ఇప్పుడు ఆస్ట్రేలియా, సింహళము, ఇటలీలలో మాత్రమే పాకిస్థాను వాణిజ్య కమిషనర్లున్నారు.

# మూసివేసినగుడ్డమిల్లులపై రాష్ట్రప్రభుత్వాల అధ్వర్యం

## త్వరలో కేంద్రప్రభుత్వ శాసనం

బొంబాయి, డిసెంబరు 8: దేశంలో అనేక కారణాల వల్ల మూయబడిన గుడ్డల మిల్లులను స్వాధీనం చేసుకుని తిరిగి నడిపించే అధికారాన్ని రాష్ట్రప్రభుత్వాలకు ఇవ్వటానికి భారత ప్రభుత్వం అంగీకరించినదని బొంబాయి కార్మిక మంత్రి గుల్జారీలాల్‌నందా నేడిక్కడ వెల్లడించాడు రాష్ట్ర ప్రభుత్వాలకు ఈ అధికారాన్ని ఇచ్చేనిమిత్తం కేంద్రప్రభుత్వం కొద్ది వారాల్లోనే భారత పార్లమెంటులో ఒక బిల్లు ప్రతిపాదించబోతున్నదని ఆయన తెలియజేశాడు.

"ఈబిల్లు వల్ల వచ్చే అధికారాలను పురస్కరించుకుని మిల్లులను తెరిపించి పని చేయించటానికి బొంబాయి ప్రభుత్వం సన్నాహాలు చేస్తున్నది. మొట్టమొదట అది షోలాపూర్‌లో అమలు జరుగుతుంది" అని ఆయన ప్రకటించాడు.

"బొంబాయి రాష్ట్రంలో ఇప్పుడు 15 గుడ్డలమిల్లులు పూర్తిగా మూతపడి ఉన్నవి. దానివల్ల 26,902 మంది కార్మికులు నిరుద్యోగులైనారు. మరి 20 మిల్లులు కొన్ని భాగాలను మూసివేసినవి. దానివల్ల మరి 10,926 మంది కార్మికులు నిరుద్యోగులైనారు. పత్తి దొరకనందున మరి రెండు మిల్లుల్ని మూసివేస్తున్నామని వాటి అధికారులు తెలియజేశారు.

బొంబాయి ప్రభుత్వం ఈ నిరుద్యోగాన్ని తొలగించాలనీ, ఉత్పత్తిని పెంచాలనీ నిశ్చయించుకుని, పరిస్థితులు మరీ అధ్వాన్నం కాకుండా తక్షణం తగిన చర్యలు తీసుకోబోతున్నది. ఆర్థికపరిస్థితుల బట్టి మూయబడిన మిల్లులన్నీ గిట్టుబాటయేవీ, కానివి అని రెండు తరగతులుగా విభజించబడినవి. మూయబడిన వాటిల్లో ఆరు మిల్లులు ఏమీ గిట్టుబాటు కావనీ, వాటిని తెరచి నడిపించటం దండగ అనీ ప్రభుత్వం గమనించింది. నాటి మిషన్లు అతి పురాతనమై ఏనాడో తుక్కు పోగులో పారేయవలసినవి. మిగిలిన తొమ్మిదింటిని తెరవవచ్చును.

కొన్ని మిల్లులలో పనకు పేకదని పోవటం వల్ల అవి కొన్ని భాగాలను మూసి వేసినవి. మరి కొన్ని నాసిరకాలను ఉత్పత్తి చేయటం వల్ల మూసుకోవలసి వచ్చింది. అచ్చగా నూలు ఉత్పత్తి చేసే మిల్లులు కూడా సరుకును అమ్మకోలేక పోతున్నవి. చేనేత పరిశ్రమ యుద్ధంలో బాగా అభివృద్ధి అయింది కాని ఇప్పుడు దానికి చెడురోజులు వచ్చినవి. అందువల్ల నూలు ఖర్చు తగ్గిపోయింది. పత్తి తగినంత దొరకనందు వల్ల కూడా దేశంలో మిల్లుల ఉత్పత్తి దెబ్బతినేట్లు ఉన్నది. కాబట్టి అవి దగ్గర ఉన్న పత్తిని పొదుపుగా వాడుకోవలసి ఉన్నది.

నిరుద్యోగులైన మిల్లు కార్మికులకు సహాయం చేసే నిమిత్తం వారికి వడ్రంగం కంబళ్ళనేత మొదలైన పనులను నేర్పటానికి ప్రభుత్వం అహమదాబాద్‌లో రెండు కేంద్రాలను స్థాపించింది. శిక్షణ పొందే కార్మికుడికి ప్రభుత్వం ధన సహాయం చేస్తుంది. బొంబాయి షోలాపూర్ లలో కూడా ఈ కార్యక్రమాన్ని నెలకొల్పటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. షోలాపూర్ అహమదాబాద్‌లలో కార్మికులకు చేసే పనులను యిప్పించటానికి కొందరు ప్రభుత్వోద్యోగులు పంపబడ్డారు. షోలాపూర్ మిల్లులను తెరవటానికి ప్రయత్నం జరుగుతున్నా, అక్కడ మొదట ఉన్న కార్మికు లందరినీ చేర్చుకొనటానికి వీలుండదు. అని ఆయన పరిస్థితుల వివరించాడు.

## ఒకటి రెండేళ్లలో ఎన్నికలు

### రాజ్యాంగ వ్యవహారాల సహాయమంత్రి ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబర్ 9: "కొత్తరాజ్యాంగంకింద సార్వజనీన ఎన్నికలు 1950 లోనో, 1951 లోనో, జరుగుతవి" అని భారతప్రభుత్వ రాజ్యాంగ వ్యవహారాల మంత్రి సత్యనారాయణ్ సింహా నేడు పార్లమెంటులో న్యాయశాఖామంత్రి తరఫున ప్రకటించాడు.

#### వోటర్ల జాబితాలు

"తూర్పు పంజాబులో వోటర్ల జాబితాలు ముద్రించడంఐపోయింది. మద్రాస్, పశ్చిమ బెంగాల్, బీహార్, ఒరిస్సా, కూర్గు, రాష్ట్రాల్లో అచ్చవుతున్నవి. బొంబాయి, సంయుక్త రాష్ట్రాలు, మధ్య రాష్ట్రాలు, అస్సాం, రాజస్థాన్, అజ్మీర్ మర్వారా, పంత్‌పిప్లోదా, హిమాచల్ ప్రదేశ్, త్రిపురాలలో జాబితాలుతయారు చేయటం పూర్తయింది. సౌరాష్ట్ర, పాటియాలా, తూర్పుపంజాబ్ సంస్థానసమాఖ్య ఢిల్లీ, కూచ్‌బీహార్, భోపాల్‌లలో జాబితాలు చాలావరకు తయారైనవి.

ఈ జాబితాలు వయోజన వోటింగ్ సూత్రాన్ననుసరించి రాజ్యాంగపరిషత్తు, రాష్ట్ర శాసనసభల ఎన్నికలకుగాను తయారైనవి. వీటిని నూతన రాజ్యాంగానికి అనుగుణంగా సవరించవచ్చును.

#### హైదరాబాద్‌లో

హైదరాబాద్‌లో జాబితాలను తయారుచేసే ప్రసక్తే ఇంకా రాలేదు. అయితే సంస్థానరాజ్యాంగ పరిషత్తు ఎన్నికలకోసం వయోజన వోటింగ్ సూత్రంమీద తయారైన జాబితాలు తయారయే ఉన్నవి. వాటిని నూతన రాజ్యాంగానికి తగినట్లు సవరించటం కష్టం కాదు. ఈ విషయమై కాశ్మీర్ ప్రభుత్వం ఇంకా ఏ చర్యనూ తీసుకోలేదు, ఆ ప్రభుత్వంతో దీనిమీద సంప్రదింపులు జరుగుతున్నవి." అని ఆయన వివరించాడు.

#### పశ్చిమ బెంగాల్

"కొత్తపద్ధతిమీద పశ్చిమ బెంగాల్‌లో ఓటర్ల జాబితాలు తయారైఉండగా, పాతపద్ధతిమీద (వయోజన వోటింగు లేకుండా) ఎన్నికలు జరపాలని ఎందుకు ఉద్దేశించబడింది?" అని బ్రజేశ్వర్ ప్రసాద్ ప్రశ్నించాడు. మంత్రిగారు మాట్లాడలేదు.

## కలకత్తాలో నర్సుల అఘాయిత్యం

కలకత్తా, డిసెంబరు 8: నిన్న కలకత్తా మెడికల్ కాలేజి ప్రిన్సిపాలును కొట్టినదని అరెస్టుచేయబడ్డ నర్సును ఈ వేళ చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేట్ బెయిలు మీద విడిచిపెట్టాడు.

కాలేజి ఆస్పత్రిలో నర్సు శిక్షణపొందుతున్న 12 మంది రోజుకి 8 గంటల కన్నా ఎక్కువ పని ఇవ్వకూడదనికోరుతూ నవంబర్ 25 వ తేదీనుంచీ సమ్మె చేస్తున్నారు. క్వార్టర్లను ఖాళీ చేయమనిప్రిన్సిపాల్ నోటీసు ఇవ్వగా వారతనిగది ఎదుటికివచ్చినిరసన తెలియజేశారు. ఉభయులకూ మాటలు పెరగటంతో నర్సులు రెచ్చిపోయి అతనిగదిలోకి జొరబడి, టెలిఫోన్ యంత్రాన్ని విరగొట్టి, అకడికి దేహశుద్ధి చేశారు. విద్యార్థులు, ఆస్పత్రి సిబ్బంది కృషి ప్రిన్సిపాలును విడిపించారు. ఒక నర్సు అరెస్టు అయింది.

#### స్త్రీ పోలీసుల జోక్యం

ఈ వేళ మళ్లీ ఒక ఆస్పత్రిలో చాలామంది నర్సులు ఎక్కువ ఎలవన్సులకోసం సమ్మెచేస్తూ ఆస్పత్రియాపర్మెంటు ఆఫీసులో జొరబడి అటకాయించారు. దానిమీదట స్త్రీ పోలీసువారువచ్చి నర్సుల సంఘమును చెదరగొట్టి 45 మందిని అరెస్టు చేశారు.

# స్వతంత్ర పఠానిస్థాన్ స్థాపనకై ఆందోళన

న్యూఢిల్లీ, డిసెంబరు 8: "బానిసత్వ శృంఖలలచే బంధింపబడి యుండుట మాకెంత మాత్రము యిష్టములేదు. పఠాను జాతివాడు ఒక్కడు మిగిలియుండునంత వరకు మేము స్వతంత్రపఖ్తూనిస్థానుకై కృషి చేసెదము" అని నూతనముగా స్థాపింపబడిన ట్రైబల్ జాతీయ సమితి అధ్యక్షుడు ఫజెల్ అహమ్మద్‌ఖాను, తన్సమితి ప్రథమ సమావేశములో ప్రకటించినట్లు కాబూల్ రేడియో బ్రాడ్‌కాస్టు చేసినది.

"స్వతంత్రజాతిగా నుండుటయే మా ఉద్దేశ్యము; మా లక్ష్యము. మరెట్టి ఉద్దేశ్యము, లక్ష్యము మాకు లేదు. ప్రత్యేక జాతిగా స్వతంత్రజాతిగా పరిగణింపబడుటకు మాకు శక్తి కలదు. ఇతర దేశము యొక్క, ఏక ఇతర ప్రభుత్వముయొక్క, ఆధిపత్యమును మేము అంగీకరింపము. మానవహక్కుల ననుసరించియు, ఐక్యరాజ్యసమితి ప్రణాళిక ననుసరించియు స్వాతంత్ర్యము కోరుహక్కు మాకుకలదు" అని ఫజెల్ అహమ్మద్‌ఖాను ప్రకటించెను.

## హైద్రాబాదుకు స్వామిజీ ప్రభృతుల ఆగమనం

సికంద్రాబాద్, డిసెం 9:—సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానంద తీర్థ గారు, యితర సంస్థాన కాంగ్రెస్ నాయకులు నేటి మధ్యాహ్నం ఢిల్లీనుండి హైద్రాబాదు తిరిగి వచ్చారు.

# ఇండొనీషియాకు స్వాతంత్ర్య ప్రదానం

## బిల్లుకు డచ్‌పార్లమెంట్ ఆమోదం

### అగ్నేయాసియా జాతీయవాదులను రెచ్చగొట్టరాదని వలసశాఖామంత్రి హెచ్చరిక

**హేగ్, డిసెంబర్ 6 :** ఇండొనీషియా స్వాతంత్ర్య ప్రదానపు బిల్లును డచ్చి పార్లమెంటు దిగువ సభ నేటి రాత్రి కావలసిన మెజారిటీతో ఆమోదించింది. బిల్లుకు అనుకూలంగా **71** వోట్లు ప్రతికూలంగా **29** వోట్లు వచ్చినవి.

డచ్చివలస రాజ్యశాఖామంత్రి జోహాన్స్‌వాన్‌మార్సెలీన్ దిగువ శాసనసభలో నేడు బిల్లును స్వీకరించవలసిందిగా సభ్యులకు సిఫార్సు చేస్తూ "ఆగ్నేయ ఆసియా జాతీయవాదులను అనవసరంగా రెచ్చగొట్టి కమ్యూనిజానికి చేతులారా ఎరగానివ్వడంకన్న వారితో ఏవిధంగానైనా రాజీ చేసుకొని సఖ్యపడడం మంచిది. ఈబిల్లు ఓడిపోతే చంకలు ఎగురవేసేది ప్రపంచంలో రష్యా ఒక్కటే'' అని హెచ్చరించారు.

"హేగ్ రౌండుటేబుల్ సమావేశ ఫలితాలే ఇండొనీషియాలో సహకారం సాధించడానికి మనకున్న చివరి అవకాశం," అని మార్సెలీన్ సభ్యులకు విన్నవిస్తూ ఇలా ఉపన్యసించారు :

"ఇండొనీషియాలో ఒక అల్పసంఖ్య గల వర్గంమాత్రమే మన పరిపాలనకు ప్రతికూలంగా ఉన్నదని డచ్చిప్రజలు ఇదివరకల్లా అనుకుంటూవచ్చారు. కాని డచ్చివారు ఇప్పుడు పరిస్థితి ఎలా పరిణమించిందీ మొత్తంమీద సరిగ్గానే ఆకళింపు చేసుకున్నారని చెప్పవచ్చును.

ఇండొనీషియాను అణచిపెట్టడం మనకు సాధ్యంకాదన్నది విస్పష్టం. దారుల్ ఇస్లామ్ ఏమి కమ్యూనిస్టులేమి ఇండొనీషియాకు ఒక పెద్ద ముప్పుగా పరిణమిస్తున్నారు. అధికారప్రదానం ఈ ముప్పును చాలవరకు తొలగించగలదు.

ఇండొనీషియా సాయుధ సైన్యాలకు ఆయుధసామగ్రిని సప్లయిచేసి సైన్యాన్ని జేశరతుణ సమగ్రంచేయాలి " నెదర్లాండ్సు ఇండొనీషియాలమధ్య బంధం శాశ్వతమైనది కాదనీ ఏ క్షణాన ఎవరికి బుద్ధిపుడితే వారు తెంచుకొని లేచిపోవచ్చుననీ రిపబ్లికన్ ప్రధానమంత్రి డా॥ మహమ్మద్ హట్టా ఇటీవల ఒకప్రకటన చేసినట్లుగా సభ్యులు కొందరు పేర్కొన్నారు; ఈ ప్రస్తావన తెచ్చి, ఒడంబడికలో ఈ విషయమై లిఖితంగా ఏమీ నిబంధించబడి యుండలేదని మార్సెలీన్ అన్నాడు. సభ్యులగనక బిల్లును నిరాకరిస్తే దానివల్ల ఉత్తరోత్తరా ఏర్పడే దారుణ ఫలిత పర్యవసానాలకు ప్రభుత్వం రక్వంతైనా పూచీ / పడజాలదని మార్సెలీన్ హెచ్చరించెను. ఒక క్రొత్త డచ్చి మంత్రివర్గం కింద ఇండొనీషియా లోనేగనుక మరియొకసారి సైనికచర్యలు జరిగినట్లయితే, అంతర్జాతీయ రంగంలో హాలెండు పరిస్థితి పూర్తిగా దుర్భరం అవుతుంది. ఇండొనీషియాలో అప్పుడు సంభవించే సంఘటనలు అణచడానికి అలవికానివై డచ్చి ప్రజల రక్తంపీల్చి పిప్పిచేయగలవు. ఈ బిల్లును మీరొకవేళ ఇప్పుడు తిరస్కరించినా, రౌండుటేబుల్ సమావేశ ఫలితాలు వాటంతటవి ఏదోవిధంగా అమలుజరిగి తీరుతవన్నది తథ్యం "

అనంతరం విదేశాంగమంత్రి డర్క్ స్టిక్కర్ మాట్లాడుతూ డచ్చిప్రభుత్వంమీద అంతర్జాతీయంగా ఒత్తిడి రావడంవల్ల ఇండొనీషియా పట్ల తాము ఈ విధానాన్ని అవలంబించవలసి వచ్చిందని, సాధ్యమైనంతవరకు డచ్చిప్రభుత్వం ఈ ఒత్తిడిని ప్రతిఘటిస్తూ వచ్చిందనీ, కాని చివరకు లాభంలేదనుకున్న తర్వాతనే తాము లొంగివచ్చామనీ, చెప్పెను.

బిల్లును నిరాకరించడం వాళెందుకు ఇండొనీషియాకు ఉభయులకు వినాశకరం కాగలదని ఆయన హెచ్చరించెను.

ఇండొనీషియా చెల్లించవలసిన అప్పులో కొంతభాగం తాము నెత్తిన వేసుకోవడం క్షాత్ల్యమైందనీ, ఇండొనీషియాలోని డచ్చిపెట్టుబళ్ళ రక్షణకై తామీ పని చేయవలసి వచ్చిందనీ, లుబెర్టస గోట్జెన్ అనే మంత్రి మాట్లాడుతూ చెప్పెను. సురబాయా నౌకాశ్రయం ఇండొనీషియా ఇచ్చివారి సమిష్టిధనంతో నిర్మించబడినా, సైనిక సహకారావశ్యకతను గుర్తించి దానిని ఇండొనీషియా ప్రభుత్వపరం చేయడమైనదని యుద్ధశాఖామంత్రి షాకింగ్ చెప్పెను. ఈ ఉపన్యాసాలకు క్రిస్టియన్ హిస్టారికల్‌పార్టీ, ఫ్రీడమ్ డెమాక్రసీ పార్టీల నాయకులు సమాధానం ఇస్తూ, బిల్లును నిరాకరించడం ఉపద్రవకరమన్న అభిప్రాయంతో తాను అనుకూలంగా వోటుచేయడానికి నిశ్చయించితిమని చెప్పిరి.

కాథలిక్, లేబర్, ఫ్రీడమ్ డెమాక్రసీ పార్టీలు బిల్లుకు అనుకూలంగా వోటుచేసినవి. అంటే రివల్యూషనరీపార్టీ, కమ్యూనిస్టులు కాథలిక్ స్వతంత్రసభ్యులు ప్రతిఘటించిరి. క్రిస్టియన్ హిస్టారికల్ పార్టీలో 4 గురు అనుకూలంగాను 5 గురు ప్రతికూలంగాను వోటుచేసిరి. వోటింగు జరిగినప్పుడు సభ్యులు వందమంది హాజరులో ఉన్నారు. డచ్చి రాజ్యాంగం ప్రకారం ఇటువంటి బిల్లుకు మూడింట రెండువంతుల మెజారిటీ అనగా 67 వోట్లు అనుకూలంగా వస్తేనేగాని బిల్లు శాసనంకాదు. బిల్లుకు దిగువసభలో అవసరమైన సంఖ్యకన్న నాలుగు వోట్లు ఎక్కువే వచ్చినవి.

### డచ్చి శాసనసభలో బుధవారం చర్చ

హేగ్, డిసెంబరు 7 : ఇండొనీషియా స్వాతంత్ర్యంగురించి నేడు తిరిగి డచ్చి శాసన సభలో చర్చసాగింది.

విదేశాంగమంత్రి స్టిక్కరు పక్షమైన స్వాతంత్ర్యపక్షానికి నాయకుడు ఎం. డి. జె. జాడ్ మాట్లాడుతూ, ఇండొనీషియా స్వాతంత్ర్యబిల్లు రాజ్యాంగానికి విరుద్ధంగా లేదుగాని అనేక సందేహాలకు తావిస్తున్నదన్నారు. ఈ బిల్లును ఆమోదించాలో, ప్రతిఘటించాలో ఇంకా ఆయన నిర్ణయించలేదట రాణిగారిస్థానం అసంతృప్తికరంగా ఉన్నదట. ఆర్థిక ఒడంబడికలు తృప్తికరంగా లేవట మొత్తంమీద బిల్లే ఏమంత ఆమోదకరంగాలేదట. ఇండొనీషియానుండి ఇప్పుడే తిరిగివచ్చిన విదేశాంగ మంత్రి స్టిక్కరు విస్పష్టమైన ప్రకటన చేయాలని జాడ్ సూచించారు. అయినప్పటికీ, బిల్లును తోసివేయడంవల్ల అంతర్జాతీయంగా హాలండు బలహీనమై పోతుందన్నారు.

కేథలిక్కుల పక్షాన డిగ్రాఫ్ మాట్లాడుతూ, ఇండొనీషియాలోని డచ్చి అధికారులు డచ్చి ప్రభుత్వం కింద నే ఉండవలసిందన్నారు.

కమ్యూనిస్టుల పక్షాన పాల్ డిగ్రూట్ మాట్లాడుతూ, హాలెండు ఇండొనీషియాలో సైనికచర్యలవల్ల సాధించలేనిది రౌండుటేబిలు సమావేశంద్వారా సాధించజూస్తున్నదనీ, ఇండొనీషియాలో బూర్జువాలమీదా ప్రజల ప్రతిఘటన తీవ్రమవుతున్నదనీ, ఇండొనీషియా స్వాతంత్ర్యం ముసుగుకింద డచ్చి సామ్రాజ్యవాదం సాగుతున్నదనీ అన్నారు.

యుద్ధకాలంలో లండనులో ఉండిన డచ్చి ప్రభుత్వానికి ప్రధాని, విప్లవవ్యతిరేకపార్టీ సభ్యుడూ అయిన ప్రొ. గెర్బ్రాండీ మాట్లాడుతూ ఈబిల్లు ద్వారా విప్లవశక్తులదీ, అంతర్జాతీయ శక్తులదీ పై చేయి అవుతున్నదనీ అయినప్పటికీ ప్రభుత్వంవారు పార్లమెంటు ఆమోదం లభించినట్టుగానే వ్యవహరిస్తున్నారనీ, సైనిక చర్య సమయంలో బందీలై ఉండిన రిపబ్లికను నాయకులు ఇంకా నిర్బంధంలోనే ఉండడానికి మారుగా రౌండుటేబిలుసమావేశంలో పెత్తనం వహించారని అన్నారు. జోగ్జకర్తాలో దొరికిన రిపబ్లికను పత్రాలు కొన్నిటిని ప్రకటించనందుకు ఈయన ప్రభుత్వాన్ని విమర్శిస్తూ, ఆ పత్రాలలో ఒకదాని నకలు తనకు లభించిందన్నారు.

స్వతంత్ర కేథలిక్కుపార్టీ సభ్యుడు వెల్లింగ్ ప్రభుత్వాన్నీ, బిల్లును తీవ్రంగా విమర్శిస్తూ, రౌండుటేబిలు సమావేశం యొక్క అన్ని సంప్రదింపులనూ ఆక్షేపించి, ఈబిల్లు నిరాకరించడం వల్ల ఏమీ జరగదన్నారు.

క్రిస్టియను హిస్టారికల్ పార్టీ తరపున టెలాటన్ మాట్లాడుతూ, యూనియను అధిపతి నిర్వచించబడక పోవడం రాజ్యాంగానికి విరుద్ధమనీ, సైనిక సమస్యల పరిష్కారం చక్కగా జరిగిందనీ, అంబాన్ మొదలైన మైనారిటీలు సమావేశ ఒడంబడికలను నిషేధించడానికి బదులు నూతన రాజ్యాన్ని నిర్మించడానికి తోడ్పడితే బాగుండేదనీ, ఇండొనీషియా సమస్య ఈ విధంగా పరిష్కారం కావడం తనకు సమ్మతమే గాని రాజ్యాంగానికి కలుగుతున్నవి మాత్రమూ, స్వయం నిర్ణయ హక్కు అంతరాయాలుగా ఉన్నవనీ అన్నారు.

కార్మిక నాయకుడు వాంషెన్ గోయెస్ వాన్ నేటర్స్ మాట్లాడుతూ, ఈ బిల్లు రాజ్యాంగానికి విరుద్ధంగా లేదనీ, ఒకవేళ ఉన్నప్పటికీ అధికార ప్రదానం ఎంత అవసరమంటే దాని కొరకు ప్రత్యేక అవసరచట్టమైనా చేయవచ్చుననీ, ఇండొనీషియా బాకీ నుండి 100 కోట్ల గిల్డర్లు తగ్గిస్తే పరిష్కారానికి 200 కోట్లు తగ్గించారనీ అన్నారు.

## కర్ణాటక శాసనసభ్యుల రాజీనామాలు

### రాష్ట్రపతికి అధికారరీత్యా సంగతి తెలియలేదు

న్యూఢిల్లీ, డిసెంబరు 8 : క్రిసమస్ లోపుగా కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీసమావేశము జరుగునని నేడు తెలిసినది. కర్ణాటక శాసనసభ్యుల రాజీనామా విషయమై కె. పి. సి. సి. నుండి తనకు అధికారరీత్యా సమాచారము తెలియలేదని రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు చెప్పిరి. పరిస్థితులనుగూర్చి వ్యాఖ్యానము గానింప రాష్ట్రపతి నిరాకరించెను. కె. పి. సి. సి. నుండి వర్తమానము రాగానే పరిస్థితులను విచారించుటకు కేంద్ర పార్లమెంటరీబోర్డు సమావేశము కావలసియుండునని డా॥ పట్టాభిగారు చెప్పిరి. కె. పి. సి. సి. అధ్యక్షుడు శ్రీ నిజలింగప్పగారు డిసెంబరు 12 తేదీన ఢిల్లీ వచ్చెదరని అనుకొనచున్నారు. అధినివేశ పార్లమెంటు సభ్యత్వమునకు శ్రీ నిజలింగప్పగారు రాజీనామా నిచ్చినట్లు ప్రకటింపబడినది. కర్ణాటక సభ్యులు మరెవ్వరు అధినివేశ పార్లమెంటు సభ్యత్వమునకు రాజీనామా నివ్వలేదు.

### కాంగ్రెసేతర సభ్యులూ రాజీనామా ఇచ్చే సూచన

హుబ్లీ, డిసెంబరు 8 : కర్ణాటకరాష్ట్ర నిర్మాణము విషయమై కాంగ్రెస్ అధిష్ఠానవర్గ మవలంబించిన వైఖరికి అసమ్మతి వెలుపుటకుగాను కర్ణాటకమునకు చెందిన యింకా ముగ్గురు బొంబాయి శాసనసభ్యులు తమ రాజీనామాలను కె. పి. సి. సి. కార్యదర్శికి పంపియున్నారు. ఇంతవరకు మొత్తం 19 మంది రాజీనామా నిచ్చియున్నారు. తానుగూడా రాజీనామా నొసంగునని మదరాసు ఎసెంబ్లీ సభ్యుడు శ్రీ ఎల్. సి. పయస్ గారు, కె. పి. సి. సి. కార్యాలయమునకు తెలిపినట్లు తెలియుచున్నది. బొంబయి ఎసెంబ్లీ యందలి 5 గురు స్వతంత్ర ముస్లిమ్ సభ్యులను రాజీనామా నివ్వవలసినదిగా కె. పి. సి. సి. కోరునని కర్నాటక శాసనసభ్యుడు హుకేరికర్ చెప్పెను. "కె. పి. సి. సి. తీర్మానము కేవలము బెదరింపు కాదు. మావాంఛా సిద్ధికై మేము తగినచర్య గైకొనదలచుచున్నాము. వెంటనే సమాధాన మొసంగవలసినదని మేము కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారిని ఒత్తిడి చేసెదము, తరువాత ఒక నిశ్చితమైన కార్యాచరణపద్ధతిని నిర్ణయించెదము" అని ఆయన చెప్పెను.

తాము స్థాపింపదలచుచున్న కర్నాటక రాష్ట్రములో యిప్పుడు మద్రాసు బొంబాయి రాష్ట్రములలో చేరియున్న 86 వేల చదరపు మైళ్ళ భూభాగము, 2కోట్ల జనాభాగల మైసూరు చేరియుండునని కే. పి. సి. సి. వారు చెప్పుచున్నారు.

## సోమలిలాండ్‌పై ఇటలీ ధర్మకర్తృత్వం

### ఒడంబడికపై భారతదేశం సంతకం చేయనవసరంలేదా ?

లేక్‌సక్సెస్, డిశంబరు 8 : సోమాలీలాండు విషయంలో ఇటలీకి ధర్మకర్తృత్వం ప్రసాదించేసందర్భంలో వ్రాయవలసివున్న ఒప్పందాని గూర్చి ధర్మకర్తృత్వ సంఘంలో చర్చజరిగే సందర్భంలో ఇండియాను ఆహ్వానించాలా ? వద్దా ? అన్న విషయాన్ని గూర్చి ఇంకా ఎటువంటి నిర్ణయం జరుగలేదు.

ఇటాలియన్ సోమాలీలాండు రాజ్యాంగం ఫలానావిధంగా వుండాలిఅని సూచించింది. ఇండియా ప్రతినిధి సర్ బి. ఎన్. రావ్ గారిని పాలొనవలసిందిగా, ఆ దేశాన్ని ఈ చర్చల్లో పాల్గొనవలసిందిగా ఆహ్వానించవలసిందని ఆస్ట్రేలియా ప్రతిపాదించింది.

ఈ ప్రతిపాదనమీద ఎటువంటి నిర్ణయం జరగకుండానే ధర్మకర్తృత్వ సంఘ సమావేశం ముగిసింది. రేపుతిరిగి సంఘం సమావేశంజరుగుతుంది.

# "బుడమేరు వరదల నివారణకు ప్రభుత్వం వెంటనే పూనుకోవాలి"

## గన్నవరం, గుడివాడ, కైకలూరు తాలూకాల రైతు మహాసభ మహజరు

### ఎంత ఖర్చయినా వెనుదీయక చంద్రగూడెం వద్ద రిజర్వాయరు కట్టించాలని విజ్ఞప్తి

విజయవాడ, డిసెంబరు 6 : "బుడమేరు వరదలవలన, దాదాపు 20 ఏళ్ల నుంచి ఈ ప్రాంతపురైతులకు సంభవిస్తున్న తీవ్ర నష్టమును గూర్చి, దాన్ని అరికట్టవలసిన సత్వరావశ్యకతను గూర్చి ప్రభుత్వమున కెన్నిసార్లు విజ్ఞాపన చేసుకున్నా, వారిప్పటివరకూ ఈ విషయంలో ఉదాసీనవైఖరినే అవలంబిస్తున్నారు. ఏటేటా నష్టపడిన రైతులకు ఎంతెంత ధనం రిమిషన్ రూపంగా తాము యివ్వవలసి వస్తున్నదో కూడా ప్రభుత్వం శ్రద్ధగా గమనించటంలేదు." అని ఈ నెల 4 వ తేదీన గన్నవరం, గుడివాడ, కైకలూరు తాలూకాల రైతులు మోపర్రులో సమావేశమై మద్రాసు ప్రభుత్వానికి ఒక మహజరు పంపుతూ, అందులో పేర్కొన్నారు.

బుడమేరుకు రిజర్వాయర్లను కట్టించవలెనని ప్రభుత్వాన్ని ఏకగ్రీవంగా ఒత్తిడి చేయటానికై ఈ మహాసభ జరిగింది. దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు అధ్యక్షత వహించారు. వి సీతామహాలక్ష్మమ్మ (ఎం. ఎల్. ఎ.) ఎమ్. అంకినీడు (తూ. కృ. కాం. అధ్యక్షుడు) ఎ. సుబ్రహ్మణ్యేశ్వరరావు మున్నగు 31 గురితో కూడిన ఒక సంఘమును నై. వెంకటేశ్వరరావుగారు సమావేశకర్తగా వారు నియమించారు.

సమావేశంలో చేయబడిన తీర్మానాలన్నిటినీ ప్రభుత్వానికి సమర్పించటానికై వీటిని ఒక మహజర్ రూపంలో సూపరింటెండింగ్ ఇంజనీరుగారికి అందజేశారు.

మహజర్ ఈ విధంగా ఉన్నది.

1947 వ సంవత్సరంలో ప్రభుత్వం 60 లక్షల రూ॥ లను మంజూరు చేసిపని ప్రారంభించింది. బుడమేటి వరదలను నిరోధించుటకై చంద్రగూడెంవద్ద ప్రాజెక్టు నిర్మించాలని ప్రధాన ఇంజనీర్ ఒకస్కీమును కూడా తయారుచేశారు, కాని కొద్దిరోజులలోనే ఈ పని ఏ కారణంవల్లనో స్తంభించి పోయింది.

ఏటేటా బుడమేరు వరదలతో వేలాది ఎకరాలు మునిగి రైతులకు, తద్వారా ప్రభుత్వానికీ విపరీతమైన నష్టంకలుగుతున్నది.

1948 లో ఒక విచిత్ర సంఘటన జరిగింది. బుడమేరు, వన్నేరుల గట్లను ఎత్తు చేయించటానికై ప్రభుత్వం తలపెట్టి, జమీందారీ గ్రామాలరైతులనుండి చందా లువసూలు చేయుమని ఓవర్‌సీర్లకు ఉత్తర్వు చేసింది. తదనుసారంగా, గట్లను ఎత్తుచేయ్యటానికి ఖర్చయిన సుమారు 40 వేల రూ॥లుపైరైతులనుండి వసూలు వేయడానికి పి. డబ్ల్యు. డి. వారు, కలెక్టర్ వుత్తర్వులు చేశారు. అసలే వరదలతో ధన, ప్రాణ, గృహ, పశునష్టం కలిగి బాధపడే రైతుల పట్ల ఇంతకంటె వేరే దురన్యాయం వుండదు. కనుక ఈచందాలను ఆపించవలసిందిగా మేము ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

బుడమేరు వరదలవల్ల బుడమేరునుండి ప్రవహించే కాల్వలకన్నిటికీ గండ్లు పడి, ఏటేటా మరమ్మతులకై ప్రభుత్వం లక్షల కొలదీ రూ ఖర్చుపెట్టవలసి వస్తున్నది. గుడివాడ, కైకలూరు, గన్నవరం తాలూకాలలో ఏటా కొన్ని లక్షల ఎకరాలు, కొన్ని లక్షల టన్నుల బియ్యం పండేవి. మునిగిపోతున్నవి. నిజాం సంస్థానంలో పుట్టి నూజివీడు, తిరువూరు, బెజవాడ, గన్నవరం తాలూకాల గుండా ప్రవహించే యీ బుడమేరు వర్షాకాలంలో పొంగి ప్రతి ఏడూఫలసాయంలో అర్ధభాగాన్ని ధ్వంసం చేసివేస్తున్నది. 1925, 1932, 1947, 1949 సంవత్సరాలలో ఈ ఏరు పూర్తి ఫలసాయాన్ని కబళించింది. ఈ ఏడాది కనీసం లక్ష ఎకరాలలోనూ, లక్ష టన్నుల ధాన్యం పైగా నాశనమైంది. అంటే టన్ను 210 రూ॥చొప్పున మొత్తం 210 లక్షల రూ॥ల నష్టం వాటిల్లింది. ఇది గాక మేత నష్టం 15 లక్షల రూ॥లుంటుంది.

స్వార్జితంనుండి గాని, బుణములు తీసుకుని గాని రైతులు తమ భూములమీద ఎకరానికి 150 రూ॥ చొప్పున మొత్తం కోటిన్నర రూ॥లు పెట్టుబడి పెడుతున్నారనే సంగతిని ప్రభుత్వమే అంగీకరించింది. కనుక పెట్టుబడి 150 లక్షల రూ॥లు కాకపైగా 225 లక్షల రూ॥ నష్టం రైతులకు వాటిల్లింది.

బ్రిటిష్‌ప్రభుత్వం పరిపాలించే రోజుల్లో మేము పంపిన మహజర్లను, పిటీషన్లను అన్నిటినీ అధికారులు బుట్టదాఖలు చేశారు. రాజాజీ ప్రభుత్వకాలంలోను, ప్రకాశం, రెడ్డి మూర్ల కాలంలోనూకూడా యిదేగతి పట్టింది.

ఈ ఏడాది బుడమేరు వరదలవల్ల 3 లక్షల ప్రజలకు తిండి, 25 వేల పశువులకు మేత కరవైంది. ప్రస్తుత కాంగ్రెసు ప్రభుత్వమైనా ఈ ప్రమాదాన్ని అరికట్టడానికి సంకల్పించవలసివుంది. లేకపోతే ఆదిప్రజా ప్రభుత్వం అనిపించుకోదు. ప్రాజెక్టును నిర్మించటమో, లేక మరోనివారణోపాయాన్ని దేన్నో అవలంబించటమో చెయ్యకపోతే కాంగ్రెసుపై ప్రజలకు పూర్తిగా భక్తి విశ్వాసాలు నశించిపోతాయి కనుక రాష్ట్రప్రభుత్వం ఈ విషయమై శ్రద్ధవహించి కేంద్రప్రభుత్వమునకీసమస్యను ఎరుకపరచి తక్షణమే నివారణచర్యలు తీసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాము. ఇదివరకటి స్కీమును పునఃపరిశీలించి, ఖర్చును గూర్చి, ఆమొత్తంపై వడ్డీలను గూర్చి సందేహించను పెట్టుకోక చంద్రగూడెంవద్ద ప్రాజెక్టును నిర్మించాలి. వరదనీరు రిజర్వాయరు శక్తికి మించిపోతే దానిని ఇబ్రహీం పట్నంవద్ద కృష్ణానదిలోకి ప్రవహింపచేయవచ్చును. ఏలూరు కాలవను దాటిన తర్వాత ఈ ఏరు గన్నవరం, గుడివాడ, కైకలూరు తాలూకాల్లో వంకర టింకరలుగా నడుస్తుంది దీనినిసరిచేయవలెననికూడా మేము విజ్ఞప్తి చేస్తున్నాము.

కొల్లేటి వరదలవల్ల కృష్ణా, పశ్చిమ గోదావరిజిల్లాల భూములకు విపరీతనష్టం కలుగుతున్నది. వరదనీరు మురుగుకాల్వల గుండా వచ్చి భూములను ముంచివేస్తున్నది కనుక కొల్లేటిని ఉప్పుటేరుద్వారా సముద్రంలోకి ప్రవహింపజేసి స్కీమును కూడా, వ్యయభారానికి వెనుదీయక సత్వరమే ప్రారంభించాలని మేము ప్రభుత్వాన్ని అర్థిస్తున్నాము.

### ధనసహాయం

బుడమేరు వరదలవల్ల తపానవల్ల పంటలన్నీ సర్వనాశనమైనాయి గనుక శిస్తును, నీటి తీరువను పూర్తి రిమిషన్ యివ్వాలి. నష్టపడిన రైతులకు ఎకరానికి 100 రూ॥ చొప్పున ప్రభుత్వము తక్కావీ బుణము ఇప్పించాలి. 1950 సం॥పు వ్యవసాయానికిగాను నష్టపడిన రైతులకు కావలసినన్ని విత్తనాలు, ఎరువులు, వ్యవసాయ పరికరాలు సప్లయి చేయించాలి. పూర్తిగా నష్టపడి, తిండికి, వ్యవసాయానికి చాలినన్ని గింజలుగాని, ఎరువులు, పరికరాలుగాని కొనలేని స్థితిలో వున్న రైతులకు అదనపు సహాయపడేందుకుగాను, ప్రతి ఫిర్కాలోను రెండు కేంద్రాల్లో ఈ సామగ్రులను నిల్వచేసి వుంచాలి. ఈ చర్యలన్నీ చెయ్యటం సాధ్యం కాదని ప్రభుత్వం భావించే పక్షంలో ఇక్కడి ఆహారపరిస్థితి యావత్తూ త్వరలో తారుమారై తీవ్ర క్షామం సంభవించగలదు."

## వెనుకబడిన దేశాలకు సాంకేతిక సహాయం

### సమితి అధ్వర్యాన రెండు మాసాల్లో ప్రత్యేక సమావేశం

లండన్, డిసెంబరు 8 : వెనకబడిన దేశాలకు సాంకేతిక సహాయం చేయడం కోసం పథకాలు వేయగలందులకై ఐక్యరాజ్యసమితి రెండుసెల్లలో ఒక సమావేశం జరుపనున్నదని ఐక్యరాజ్యసమితి పాకిస్తాన్ ప్రతినిధివర్గ సభ్యుడైన ప్రొ॥ మహమ్మద్ హుస్సేన్ ఈ వేళ వెల్లడించెను.

బహుశా ఈ సమావేశం న్యూయార్కులో జరుగుతుందనీ, సమితి కార్యదర్శి ట్రిగ్వేలై సమావేశం జరపడం గురించి వివిధ దేశాలతోను సంప్రతింపులు జరుపుతున్నాడనీ, ప్రొ॥ హుస్సేన్ చెప్పెను.

ప్రొ॥ హుస్సేన్ లేక్ సక్సెస్ నుండి స్వదేశానికి తిరిగి వస్తూ బుధవారంనాడు మార్గమధ్యంలో ఇక్కడ దిగెను. ఐక్యరాజ్యసమితి వెనుకబడిన దేశాల సాంకేతిక సహాయంకోసం ఒక ప్రత్యేకనిధిని సృష్టించబోతున్నదనీ, ఈ నిధికి సభ్యదేశాలు ఎవరికి తోచినట్లుగా వారు విరాళములు ఇవ్వవచ్చుననీ, ఆయన వివరించెను.

సాంకేతిక సహాయ కార్యక్రమాన్ని నిర్వచించి దానికి ఒక నిర్దిష్టమైన స్వరూపం ఇవ్వడానికి సాంకేతిక సహాయపు బోర్డు అనీ, సాంకేతిక సహాయపు కమిటీ అనీ రెండు సంఘాలను నెలకొల్పవలెనని నిర్ణయింపబడెననీ, బోర్డు నిపుణులతో కూడిన సంఘం అయితే కమిటీ సాంకేతిక సహాయ కార్యక్రమంమీద ఆసక్తిగల వివిధ దేశాల ప్రతినిధులతో చేరి ఉంటుందనీ, కమిటీ ఆర్థిక సాంఘిక మండలికీ బోర్డుకు అనుసంధాతగా వ్యవహరిస్తుందనీ, హుస్సేన్ గారు చెప్పిరి.

"ట్రూమన్ ప్రణాళికలోని 4 వ అంశాన్ని అనుసరించి ఈపథకం నిర్వహించబడుతుంది. ఏ దేశానికి ఏవిధమైన సహాయం అవసరమో కనిపెట్టడానికి ఆయా దేశాలకు సాంకేతిక నిపుణులు పంపబడుదురు. వీరు స్థితిగతులన్నీ పరిశీలించి కొన్ని సిఫార్సులు చేస్తారు. ఈ సిఫార్సులను అనుసరించి సమితి తన వివిధ శాఖోపశాఖల ద్వారా ఆయా దేశాలకు సాయం అందజేస్తుంది."

## తాడేపల్లిగూడెం పంచాయతీ కోర్టు

తాడేపల్లిగూడెం, డిసెంబరు 8: నేడు తాడేపల్లిగూడెం పంచాయతీ కోర్టుకు దామోజీపురపు వెంకటనరసింహ అప్పారావు గారిని అధ్యక్షులుగాను (గ్రామమునబు) కవ్వలి వెంకట్రావుగారిని ఉపాధ్యక్షులుగాను ఎన్నుకొనిరి. స్వ. వి.

# వెనుకబడిన రాష్ట్రాలలో రస్తాల నిర్మాణానికి అదనపు వ్యయం

## దాదాపు 10 లక్షలు ఎక్కువగా ఖర్చు చేయడానికి భారతశాసనసభ నిర్ణయం

న్యూఢిల్లీ, డిశంబరు 8 : ఇండియా పార్లమెంటు ఈ వేళ వెనకబడివున్న రాష్ట్రాలలో రస్తాలనిర్మాణాభివృద్ధికోసమని నూటికి 5 వంతులు ఎక్కువగా ఖర్చు పెట్టాలని నిర్ణయించింది. దీనినిబట్టి భారతప్రభుత్వం పదిలక్షలు ఎక్కువగా ఖర్చు పెట్టవలసిఉంటుంది.

ఈ పెట్టేఖర్చు కేంద్రంలోని రస్తాల నిధినుండి సేకరిస్తారు. ఈ రస్తాలనిధి పెట్రోలుమీద వెయ్యబడినపన్నులవలన సమకూర్చబడుతున్నది. ప్రస్తుతంపెట్రోలు మీద గాలనుకు 15 అణాలపన్ను వేస్తున్నారు. ఇందులోమళ్ళీ ¼ రెండున్నర అణాలుపన్ను రస్తాలనిధికి ఇచ్చివేస్తారు.

1948-49 లో ఈ రోడ్డునిధి 2 వందల లక్షల రూపాయలవరకు పెరిగింది. ఇందులో 30 లక్షలు మూలనిధికిందికి వెళ్ళిపోతాయి.

ఇప్పుడు కేంద్రప్రభుత్వం ఈ మూలనిధిని బాగా అభివృద్ధిపొందించాలని చూస్తున్నది. దీనివల్ల రాష్ట్రాంతరరవాణా సౌకర్యాలు వృద్ధిపొందిస్తారు. ఈ సౌకర్యాలవృద్ధివల్ల వెనకబడిన రాష్ట్రాలకు చాలా ఉపకారం జరుగుతుంది.

భారత మంత్రి కె. సంతానం ఈ విషయంలో మాట్లాడుతూ, గత 19 ఏళ్లనించీ కేంద్ర రవాణా నిధి మార్పు లేకుండా అట్లాగే ఉండిపోయిందనీ, ఇందులో కొంత భాగం కేంద్ర మూలనిధిలోనికి పోతున్నదనీ, దీనిని ఆయా రాష్ట్రాల పెట్రోలు ఖర్చును అనుసరించి వాటికి పంచి పెట్టబడుతున్నదనీ చెప్పారు. అయితే రవాణా సౌకర్యాలు బాగా అభివృద్ధి చెందిన రాష్ట్రాలు ఖర్చును బట్టి ఈ ధనం పంచిపెట్టాలని అనేవనీ తదితర రాష్ట్రాలు దీనికి వ్యతిరేకించేవనీ, దీనివల్ల కేంద్రం ఉపయోగం పొందడం లేదనీ, ఇప్పుడు కేంద్ర మూలనిధి నూటికి 15 వంతుల నుండి 20 వంతుల వరకు పెంచబడుతున్నదనీ కూడా కె. సంతానం చెప్పారు.

అపిమ్మట యన్. జి. రంగా కూడా ఈ తీర్మానాన్ని సమర్థిస్తూ, వెనుకబడిన రాష్ట్రాల అవసరాలను బట్టి మూలనిధిని ఆయా రాష్ట్రాలలో పంచి పెట్టాలనీ, వెనకబడిన రాష్ట్రాలకు ఎక్కువగా ఖర్చు పెట్టాలనే విషయం తదితర రాష్ట్రాలు అంగీకరించడం న్యాయంగా ఉన్నదనీ అన్నారు. తూర్పు పంజాబు, పడమటి బెంగాల్ ప్రతినిధులు ఇండియా సరిహద్దులలోని రాష్ట్రాలలో రవాణా సౌకర్యాలు పెంచాలని అన్నారు.

ఆ పిమ్మట కె. సంతానం చర్చకు సమాధానం చెబుతూ బాగా ఆదాయం వచ్చే రాష్ట్రాలు నూటికి 5 వంతులు ఎక్కువగా కేంద్ర మూలనిధికి సహాయం చేసినవనీ, ఇది కేవలం సంప్రతింపులవల్లనే జరిగినవనీ భారత ప్రభుత్వం ఈ విషయంలో నిర్బంధ విధానం ఉపయోగించ దలచ లేదనీ చెప్పారు.

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 9:

బంగారు – వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు ధరను 1 కి ఎక్స్వర్డు బాను సేల్సుటాక్సుతో సహా రు. 76 12-0 పెట్లా బంగారుకు తులం 114-12-0 మాసబంగారు 113-6-0 సీమవెండి తులం 100 కి (రెడి 172-0-0 వెండి తులం 1-కి 1-12 0

**వేరుసెనగ:** (561 కా 1-కి ఎరువు కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది. రు. 161, 162 (కోరమాండల్) . 163-0-0 (కాండివ్)

వేరుసెనగనూనె ఎక్స్పెల్లర్ (డీవరేజి) రు. 839-0-0 3టు 5% యస్. యస్. ఎ.

కొంకాయనూనె (87 పౌన్లు గల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్విలాన్.
రు. 34-10-9, 35-12-9

ఆముదం

కాండి 500 పౌనులుగలది రు. 260, 265 (ఒంగోలు, నరసరావుపేట) రు. 270, 275

పంచదార

నర్కటాగంజి (2అందరు) రు. 94-9-5



## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 11 ఆదివారం

### మద్రాసు (ఎ)

ఉ. 7-30 ఉదయసంగీతం (రి). 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 గానమంజరి (రి) మ. 1-0 ఎస్. వి. పార్థసారథి. ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా సహా. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా రికార్డులు. 3-0 రుక్మిణీ రాజగోపాలన్ పాట. 4-0 మద్రాసు (బి) వలె. 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా. 5-30 ఎం. ఎస్. చంద్రశేఖరయ్య పాట 6-0 ఆంగ్లమున వార్తలు 6-15 జ్ఞానం సంతానం పాట 6-45 వెల్లూర్ ఎం. రామమూర్తి పాట. 7-30 గీతమంజరి. (రి). 7-45 మద్రాసు (బి) వలె. 8-0 రుక్మిణీ సుందరరాజన్ పాట 8-30 మద్రాసు (బి) వలె. 9-0 ఆంగ్లమున వార్తలు, 9-15 ఎస్. వి. ఎస్. నారాయణన్ పాట. 9-45 పాశ్చాత్య సంగీతం (రి).

### మద్రాసు (బి)

ఉ. 7-0 తెలుగున వార్తలు. 7-15 లలితా వెంకట్రామన్ వీణ. గాత్రము. రికార్డులు 7-45 మద్రాసు (ఎ) వలె. మ. 1-0 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 ఆటవిడుపు. నిర్వహణ న్యాయపతి రాఘవరావు 3-0 మద్రాస్ (ఎ) వలె. 4-0 కదంబం (రి) సా 5-30 మద్రాసు (ఎ) వలె 6-15 సాయంసంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం పల్నాటియుద్ధం బుర్రకథ 7-0 తెలుగున వార్తలు 7-15 విప్రకుమారరత్నం ఉత్తర హరివంశమునుండి పురాణ కాలక్షేపం. 7-45 గ్రంథ విమర్శ వి. రంగయ్య 8-0 మద్రాసు (ఎ) వలె 8-30 బి. టి. రాజప్ప వయొలిన్ 9-0 మద్రాసు (ఎ) వలె 9-45 పాలఘాట్ సుబ్రహ్మణ్యయ్యర్ 10-0 శ్రోతలుకోరిన పాటలు రికార్డులు

### విజయవాడ

ఉ 7-0 తెలుగున వార్తలు 7-15 తురయూర్ ఎం. రాజగోపాలశర్మ 7-30 ఎం. రంగనాయకమ్మ పాట 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 విజయవాడ రేడియో ఆర్కెస్ట్రా 8-30 వినువీధి ప్రబంధవీచిక వసుచరిత్ర గాలివాన కథానిక రచన గౌతమప్రస్తావన రూపకము రచనప్రయోగము 1-0 తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు, 1-50 తెలుగున వార్తలు 4-0 పేరంటం ఇల్లాలి జీవితంలో మధుర ఘట్టాలు కొత్తకాపురం. ప్రసంగం లోకదర్శిని అంతర్జాతీయ ఆహార సమితి. ప్రసంగం. సా. 5-30 రాజా జగన్నాథదేవ్. వర్మ. వయొలిన్. 6. ఆంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం. (మదరాసు నుండి) 7. తెలుగున వార్తలు. 7-30 ఎం. రంగనాయకమ్మ పాట. 7-45 ఇంద్రధనస్సు రికార్డుల కార్యక్రమం. దర్శన దీక్షిత్. 8. ఎం. బాలమురళీ కృష్ణ పాట. 9. ఆంగ్లమున వార్తలు. 9-15 మద్రాసు వలె. 9-45 రాజా జగన్నాథదేవ్ వర్మ. వయొలిన్.

### హైద్రాబాదు

ఉ. 7-30 షరీమా బేగంపార్టీ. సాలా మార్నియా. 7-45 భజన్ (రి). 8. ఆంగ్లమున వార్తలు, ఎ. ఐ. ఆర్. రిలే). 8-20 సంగీతపాఠం. 8-30 ఎ. ఆర్. వెంకట్రామన్. కర్నాటక సంగీతం. 8-50 తెలుగున వార్తలు. 9-15 మొయిన్‌ఖురేషీ. ఘజల్. మ. 12-30 ఓప్తా రికార్డులు. 1. బి. రాజరత్నం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే) సా. 5. మాధవరావు. ఖయాల్ మార్వా. 5-10 షరీమా బేగంపార్టీ. సలాం మార్నియా 5-25 మొయిన్ ఖురేషి: దాద్రా. ఘజల్. 5-40 ఖదీజా బేగం సోహనీ 6-30 మహిళామండలి తెలుగున కథానిక జ్ఞాననాయుడు. కర్నాటక సంగీతం. 'పాశ్చాత్యసంస్కృతి అవసరమా' సంభాషణ, రచన ఎన్. ఇందిరాదేవి. 7 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 7-15 గ్రామస్థుల కార్యక్రమం. తెలుగున. 'దేవదాసి' రికార్డులతో కూర్చిన కథ. 7-45 యుగయుగాలలో పౌరధర్మము. 'నియంతృత్వ రాజ్యాల్లో పౌరుడు' తెలుగున ప్రసంగం. బి. వి. రామనరసు. 7-55 మొయిన్‌ఖురేషిగీత్. 8-30 మాధవరావు ఖయాల్‌పూరియా. 8-45 ఖదీజాబేగం. సలాం సోహనీ. 9 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 9-55 ఎ. ఆర్. వెంకట్రామన్ కర్నాటక సంగీతం. 10-30 బాజం ఏ ఆ జా.

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 8:

మార్చిచాయిదా ధరలు

| | | | |
|---|---|---|---|
| నేటి | ప్రారంభం | వెల | 30 39 |
| | నిన్న | | 30 25 |
| ,, | ముగింపు | వెల | 30 21 |
| | నిన్న | | 30 34 |

# నెహ్రూ ప్రభుత్వంపై సోషలిస్టు విమర్శ

## శ్రీకాకుళంలో జయప్రకాష్ నారాయణ ఉపన్యాసం

శ్రీకాకుళం, డిసెంబరు 6: "మన దేశానికి ప్రస్తుత భాగ్యవిధాతలు నెహ్రూ, పటేల్. వారిని విమర్శించేశాహతు ఎవరికీ లేదు. వారు అన్యాయంగానూ, స్వార్థబుద్ధితోనూ ప్రవర్తించే వ్యక్తులు కారు. అయినా, నెహ్రూ పటేల్ ప్రభుత్వము ప్రజా ప్రభుత్వం కావన్న సంగతిని మరిచి పోరాదు." అని సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాష్ నారాయణ ఈ నెల 3 వ తేదీన ఉత్తర విశాఖలోని హరిపురంలో ఒక పెద్ద బహిరంగ సభలో ఉపన్యసిస్తూ, అన్నారు.

ప్రస్తుతం ఇండియాలో చట్టబద్ధంగా జరుగుతున్న దోపిడీ విధానం నశిస్తే గాని బీద ప్రజలకు ముక్తి లేదని ఆయన అన్నారు.

రాష్ట్ర, కేంద్రప్రభుత్వ విధానాలను విమర్శిస్తూ, జయప్రకాష్ ఇంకా ఇలా అన్నారు.

"మనను దోచుకొనేవారు నాలుగురకాలుగా వున్నారు. మహారాజాలు, జమీందారులు, పెట్టుబడిదారులు, ఎక్కువ జీతాలుపుచ్చుకునే అధికారులు. ఇంత కాలమూ ప్రజలస్వాతంత్ర్యాన్ని క్రూరంగా అణచివేసిన మహారాజాలవిషయంలో, చిన్నసంస్థానాధీసులనుతప్ప, మిగతా పెద్దవారందరినీ కేంద్రప్రభుత్వం తొలగించటం మాట అటుంచి ప్రత్యేకహోదాలనిచ్చి గౌరవించింది. ప్రజలరక్తమాంసాలను పిండుకున్న జమీందారులనుండి జమీలు లాక్కుంటున్నా, రాష్ట్రప్రభుత్వాలు వారికి ప్రజలనుండి వసూలుచేసిన సొమ్ముతో నష్టపరిహారం చెల్లిస్తున్నాయి. పెట్టుబడిదారులవిషయంలో, మరోకపదేండ్లదాకా పరిశ్రమలను జాతీయంచేయబోమనీ ఆ తరువాతి మాటకూడా ఇప్పుడు చెప్పలేమని భారతప్రభుత్వం స్పష్టం చేసింది.

ఇక అధికజీతాలవిషయమై చెప్పాలంటే, బ్రిటిష్ ప్రభుత్వం తొలగిపోయినా మన పరిపాలనలోను, అధికారులకు, ఉద్యోగులకు, ఇవ్వబడే జీతాలలోనూ మార్పులేమీ రాదు. మాన్య రాజ్యాంగంలో అధ్యక్షుని జీతం నెలకు 10 వేలు. కాని కేంద్ర జీత నిర్ణయసంఘంవారి సిఫారస్సు ప్రకారం మనదేశంలో కనిష్ఠజీతం 30 రూ॥ లు మాత్రమే. ఇంత వ్యత్యాసం ఎందుకుండాలి?

సోషలిస్టుపార్టీ అధికారంలోకివస్తే, ఈ రెండు ముఖ్యసూత్రాలను అమలు చేస్తుంది. పనిచేసేవారే సంపదను సృష్టిస్తున్నారు. కనుక వారికే ఆ సంపద చెందుతుంది. అంతేకాక, సంపద సామ్యసూత్రప్రకారంగా, న్యాయంగా, పనిచేసేవారికి పంచబడుతుంది. ప్రస్తుతం ఉన్న అధిక వ్యత్యాసం తొలగించబడుతుంది. ఏ మనిషికీ 12½ ఎకరాలకు తక్కువ భూమి ఉండటానికి వీల్లేదు. ఈ సూత్రాలకోసమే సోషలిస్టుపార్టీ పోరాడుతున్నది. కనుక మీరంతా దానిలోచేరి ఈ సూత్రాల కోసం పోరాడండి."

సభాధ్యక్ష సంఘాధ్యక్షుడు ఎస్. ఈశ్వరప్పగారు జయప్రకాశ్‌ను ఆహ్వానిస్తూ 216 రూ॥ లకు బహూకరించారు. సోంపేటతాలూకా గ్రామోద్యోగుల తరఫున జి. పద్మనాభరావుగారు స్వాగతమిచ్చారు.

సభానంతరం జయప్రకాశ్ శ్రీకాకుళం సోషలిస్టు నాయకులైన ఎమ్. వి. కృష్ణశర్మ, ఎస్. వి. ఎల్. సాంబశివరావు గార్లతో కలిసి బరంపురం వెళ్లారు.

(స్వ. వి)

# ఆంధ్రరాష్ట్ర టెన్నిస్ సంఘ స్థాపన

## ఉయ్యూరు కుమారరాజా అధ్యక్షులుగా ఎన్నిక

గుంటూరు, డిశంబర్ 7: ఆంధ్రదేశంలోగల టెన్నిస్ క్లబ్బుల ప్రతినిధులు ఈ నెల 4 తేది గుంటూరు, ఎల్. వి. ఆర్. ఎండ్ సన్సు క్లబ్బులో సమావేశమై, ఆంధ్రరాష్ట్ర టెన్నిస్ సంఘమును నిర్మించారు.

ఆంధ్రమహాసభాధ్యక్షులైన ఉయ్యూరు కుమారరాజా గారి ప్రోత్సాహంమీద కార్యదర్శి జి. వి. పున్నయ్యశాస్త్రిగారు ఈసమావేశాన్ని ఏర్పాటుచేశారు.

కుమారరాజా ఆం. రా. టెన్నిస్ సంఘాధ్యక్షుడుగాను, పున్నయ్యశాస్త్రి, జస్కరన్ భువల్కార్, ఆర్. హెచ్. హయ్యస్, ఎన్. కృష్ణస్వామిగార్లు ఉపాధ్యక్షులుగాను, ఆర్. హనుమంతరావుగారు ప్రధాన కార్యదర్శి, కోశాధికారిగాను జానకిరామయ్య, డి. ఎన్. రెడ్డిగార్లు సంయుక్త కార్యదర్శులుగాను ఎన్నుకోబడ్డారు. ఈసంఘమును అఖిల భారత లాన్ టెన్నిసు సంఘానికి అనుబంధం చెయ్యటానికి నిశ్చయింపబడింది.

# "రైతులకు తగినంత రక్షణ ఇవ్వాలి"

## రాష్ట్రపతి డా॥ పట్టాభి ఉద్బోధ

ధనబాద్, డిసంబరు 6: కాంగ్రెస్ మహాసభాధ్యక్షులగు డా॥ పట్టాభి సీతారామయ్యగారు నేడు ఝరియాలో బహిరంగసభయందుపన్యసించుచు రాబోవు ఎన్నికలలో వయోజన వోటింగు హక్కునుసరించి 17 కోట్లమంది వోటుచేయ వీలగునని, ప్రజలు తమ ప్రతినిధుల నెన్నుకొనుటకు సంపూర్ణమగు స్వేచ్ఛయుండునని చెప్పిరి.

గత మూడుసంవత్సరములనుండి కాంగ్రెస్‌వారు అధికారములో నున్నారన్ని, అధికారమునకు వచ్చిననాటి నుండియు వారు శరణాగత సమస్యను పరిష్కరించుటలో నిమగ్నమై యుండిరని రాష్ట్రపతి చెప్పెను. కార్మికుల అభివృద్ధికై ప్రభుత్వమువారు పారిశ్రామిక తగాదాల చట్టము, కనీస వేతనముల చట్టము, బొగ్గుగనుల ప్రావిడెంటుఫండు, బోనసు చట్టము గావించిరని రాష్ట్రపతి చెప్పుచు కార్మికుల అభివృద్ధికి యెట్టిచర్యలు గైకొనబడుచున్నవో అట్టి చర్యలనే రయితుల అభివృద్ధికిగూడ గైకొనవలెననిరి. ఆహారమును ఉత్పత్తి చేయువారికి తగినంత రక్షణ యుండవలెననిరి.

రాష్ట్రపతి నేడుపవజామున భాగల్‌పూరువచ్చి అచ్చటినుండి సింద్రీకివెళ్ళిరి. అచ్చట నిర్మింపబడుచున్న ఎరువుల ఫాక్టరీని దాని యజమానులు రాష్ట్రపతికి చూపిరి. ఫాక్టరీలో జరుగుచున్న పనిని రాష్ట్రపతి శ్రద్ధగా తిలకించిరి.

### "ప్రత్యేకతను విడనాడుడు"

భగల్‌పూరు, డిసెంబరు 6: ఈకాలపు జీవితములో వెల్లివిరిసియున్న ప్రత్యేకతను విడనాడవలసినదని రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు యిచ్చటి కళాశాలా విద్యార్థులకు సలహానొసంగిరి. నేడు రెండు విద్యార్థి సభలకు యేర్పాటు చేసినందుకు రాష్ట్రపతి విద్యార్థులను తప్పుబట్టిరి. దేశమునకు స్వాతంత్ర్యము చేకూరియుండుటచే దేశభక్తులందరు ఒకసోదర బృందముగా నేర్పడవలెననిరి. అప్రస్తుతులం పరాదనిరి. సమ్మెదారుల ఊరేగింపులలో చేరురోజులు, విద్యాసంస్థలను బహిష్కరించు రోజులు గతించినవనిరి. పాఠశాలలు, కళాశాలలు యువకులకు తలిదండ్రులవలె విద్యాబుద్ధులు గరపు సంస్థలు వారిని పౌరధర్మ నిర్వహణకు తగినవారినిగా చేయు సంస్థలు అయినవనిరి. స్వతంత్ర భారతములో 'ఇన్‌క్విలాబ్ జిందాబాద్' అను మాటకు అర్థము లేదని వ్యాఖ్యానించిరి, కళాశాల ఆవరణలో జరిగిన మరియొక విద్యార్థుల సభలో రాష్ట్రపతి చెప్పిరి. స్వరాజ్యము చేకూరిన తరువాతకూడ విద్యార్థులు విదేశీ దుస్తులను ధరించుచుండుట విదేశీయ వస్త్రధారణా పద్ధతుల నవలంబించుచుండుట శోచనీయమనిరి. యువకుల మనస్తత్వములో మార్పేమియు కలుగని యెడల "క్విట్ ఇండియా" ఉద్యమమునకు యేమి అవసరము కలదు? అని యడిగిరి.

అనంతరము రాష్ట్రపతి నూతనముగా ప్రారంభింపబడిన మహిళా కళాశాల విద్యార్థినుల సభలో నుపన్యసించుచు హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లు విషయమై ప్రస్తావించిరి ఈ బిల్లుద్వారా స్త్రీలకు లభింపబోవు విడాకుల హక్కును స్త్రీలు సక్రమముగా ఉపయోగించుకొనవలెనని స్త్రీలకు సలహానిచ్చిరి.

# తాడేపల్లిగూడెమునకు గోపాలరెడ్డిగారి రాక

తాడేపల్లిగూడెం, డిశంబరు 8:—

మద్రాసు ఆర్థిక మంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు, మాగంటి బాపినీడు (యం.యల్.ఏ. అధ్యక్షులు రాష్ట్ర హరిజన సేవా సంఘం) మాగంటి సీతారామదాసు (పశ్చిమ గోదావరి జిల్లా బోర్డు అధ్యక్షులు) గార్లతో నేడు మద్రాసు నుంచి యిచ్చటకు వచ్చిరి. స్టేషన్ వద్ద మంత్రిగార్కి, ఆత్మకూరి గోవిందాచార్యులు, (యం. యల్. సి.) తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు తుమ్మలపల్లి సత్యనారాయణ మూర్తి, చింతలపాటి వరప్రసాదమూర్తిరాజు, తుమ్మలపల్లి వీరభద్రరావు, తాడేపల్లి ముసలయ్య, పసల సూర్యచంద్రరావు, డాక్టరు యస్. ఆర్. అత్తిలి. పి. యస్. యన్. శర్మగారలు జిల్లా అధికారులు, స్థానికా అధికారులు మొదలైనవారు స్వాగతం యిచ్చిరి.

తాలూకా కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ చేతిరెడ్డి సత్యనారాయణ మూర్తి మంత్రిగారిని పుష్పమాలాంకృతులం చేసిరి. ఇచ్చటనుంచి మంత్రిగారు ప్రత్యేక సాయుధ పోలీసు కేంద్రానికి వెళ్ళిరి. అక్కడ మంత్రిగార్కి పోలీసులు గౌరవ వందనం సమర్పించిరి.

అచ్చట నుంచి మంత్రిగారు వచ్చి పసల సూర్యచంద్రరావుగారి భవనమున తమ గౌరవార్థం చేయబడిన అల్పాహార విందుకు హాజరైరి. అనంతరం గోపాలరెడ్డిగారు సపరివారంగా తణుకు వెళ్లిరి.

# ఇండియా పాకిస్థాన్ సరిహద్దు తగాదా

## భారత న్యాయవాది సర్ బోస్ వాదము

కలకత్తా, డిసెంబరు 7: పాకిస్థాన్-భారత సరిహద్దు తగాదా విచారణ సంఘము యెదుట భారత న్యాయవాది సర్. ఎస్.ఎం. బోసు నేడు వాదము సాగించుచు ముర్షిదాబాదు (భారత యూనియను) షాహి (పాకిస్థాను) జిల్లాల మధ్య సరిహద్దు ఎన్నటికినీ మారనదిగా నుండవలెనని వాదించెను.

ఈ రెండు జిల్లాలమధ్య నవాబ్ జాన్, షిచ్ గావ్ పోలీసు స్టేషనులమధ్య సరిహద్దు యిదివరకే రాడ్ క్లిఫ్ ఎవార్డులో నిర్ణయింపబడెనని రాడ్ క్లిఫ్ గీసిన సరిహద్దు గీటును అమలు చేయవలెనని ఉభయ అధినివేశముల ప్రభుత్వములు విచారణ సంఘము వారిని కోరుచున్నారు గాని, క్రొత్త సరిహద్దుగీటు గీయవలసినదని కోరుటలేదని సర్ బోసు గారు చెప్పిరి. ఈ సరిహద్దు తగాదాను స్థిరముగా పరిష్కరించ వలసినదని భారత ప్రభుత్వపక్షమున బోసుగారు కోరిరి.

రాడ్ క్లిఫ్ ఎవార్డు ప్రతిని సర్ బోసుగారు విచారణ సంఘ సభ్యులకు సమర్పించి సంతృప్తికరముగు సహజ సరిహద్దులు బహు కొద్దిగా నుండెనని రాడ్ క్లిఫ్ తలచెననిరి. జిల్లా సరిహద్దును పరిహద్దు గీటుగా రాడ్ క్లిఫ్ అంగీకరించెననిరి. గంగానదితో తనకెట్టి సంబంధము లేదని, జిల్లా సరిహద్దు గీటును కనుగొనుటకు గంగానది సూచన మాత్రమే యని రాడ్ క్లిఫ్ తెలిపెననిరి. నదిని రాడ్ క్లిఫ్ సరిహద్దుగా తీసికొనలేదని చెప్పుచు బోస్ గారిట్లనిరి. "జిల్లా సరిహద్దును సూచించుటకే నది పేరును రాడ్ క్లిఫ్ ఉపయోగించెను. సరిహద్దు గీటును వర్ణించుటలో రాడ్ క్లిఫ్ 'నది' అను పదమును వాడక పోయినను జిల్లా సరిహద్దు విషయమై ప్రస్తావన వచ్చినప్పుడు 'నది' పేరు వాడ్చనని ఆయన గ్రహించెను. కనుక జిల్లా సరిహద్దే సరిహద్దు గీటని, గంగానది గతి సరిహద్దు కాదని, రాడ్ క్లిఫ్ చెప్పెను. గంగానది గతి మాటిమాటికీ మారుచుండుట చేత జిల్లా సరిహద్దు గీటును కనుగొనవలెనని రాడ్ క్లిఫ్ తలచెను. మరియొక విధముగా తలప వీలులేదు.

రాడ్ క్లిఫ్ ఎవార్డు పై వ్యాఖ్యానము గావించుటలో అంతర్జాతీయ న్యాయశాస్త్రము ప్రసక్తియే లేదని సర్ బోసు వాదించెను. పాకిస్థాన్ న్యాయవాది అంతర్జాతీయ న్యాయశాస్త్రము విషయమై ప్రస్తావించిన తరువాత దాని విషయమై తాను గ్రంథములను పరిశీలించెనని బోసు గారు చెప్పుచు అంతర్జాతీయ న్యాయ సిద్ధాంతమిట్లున్నదనిరి: "ఒకనది సరిహద్దుగా నుండి అది మారనిదిగా నుండిన ఎడల అప్పుడు నది సరిహద్దుగా నుండును. నది గతి హఠాత్తుగా మారునదై యున్న యెడల నది తన శయ్యను వీడిన యెడల లేదా ఎండిపోయిన యెడల అప్పుడు సరిహద్దు గీటు పూర్వ సరిహద్దు గీటైయుండును.

అంతర్జాతీయ న్యాయ సిద్ధాంత మిదియని బోసుగారు చెప్పుచు ఈతగాదా పరిష్కారములో నది గతిని విచారణలోనికి తీసికొనరాదనిరి. కనుక రాడ్ క్లిఫ్ పటము పై చూపిన జిల్లాగీటును అనుసరించి తద్వారా రాడ్ క్లిఫ్ ఎవార్డును ఆచరణయందుంచుటయే కర్తవ్యమనిరి. ఈ తగాదాను స్థిరముగా పరిష్కారము చేయు మార్గమును విచారణసంఘమువారు మాడవలెనని కోరుచు సర్ బోసుగారు వాదమును పూర్తిచేసిరి. విచారణ రేపటివరకు వాయిదాపడినది.

# "భాషారాష్ట్ర నిర్మాణానికి దారితీసింది బీహారే"

## మహేశ్ నారాయణగారి కృషి ప్రశంస: రాష్ట్రపతి డా॥ పట్టాభి వీడ్కోలు సందేశం

పాట్నా, డిసెంబరు 7: "శ్రీ॥ శ్రీ॥ శ్రీ మహేశ్ నారాయణ్ గారి కృషిఫలితముగా భాషా రాష్ట్ర నిర్మాణమునకు త్రోవజూపిన బీహారు నాకును, ఆంధ్ర మహాజనులకును మార్గదర్శియైనది. '1911 సం॥ డిసెంబర్ 12న బీహారు భాషా రాష్ట్రముగా నేర్పడకుండినయెడల అది అర్థికముగా నభివృద్ధియై యుండెడిది కాదు. సంపత్ సమృద్ధమై యుండెడిది కాదు' అని పార్లమెంటులో లార్డు కర్జన్ చెప్పి యుండెను." అని రాష్ట్రపతి డా॥పట్టాభి సీతారామయ్యగారు నాల్గురోజుల బీహారు పర్యటనమును ముగించుకొని విమానములో ఢిల్లీ వెళ్ళు నవసరమున బీహారును ప్రశంసించుచు చెప్పిరి.

"ఇందువల్లనే బీహారు అభివృద్ధియయ్యెను.. భాషారాష్ట్రముగా నేర్పడకుండిన యెడల నది అభివృద్ధియయ్యెడిది కాదు. తరువాత యేర్పడిన ఒరిస్సావంటి భాషా రాష్ట్రములు గూడ యిట్లే అభివృద్ధి జెందినవి. నిర్మాణ కార్యక్రమములో బీహారు భారత దేశమంతటికి మార్గదర్శకమైనది. ఖద్దరు ఉద్యమము రాష్ట్రములో బాగా అభివృద్ధియైనది. మద్యపాననిషేధోద్యమముగూడ దీనితో బాటు వ్యాప్తిజెందినయెడల బాగుండెడిది. హిందూ-ముస్లిమ్ సఖ్యతకు సర్వత్ర అవకాశములు కనిపించినవి. అస్పృశ్యత నామమాత్రమైనది. రాష్ట్రములో యువజనోద్యమము వ్యాపించినది. ఈ యువకులు పెద్దలతో కలిసి పని చేయుచున్నారు. ఈ విషయములో యితర రాష్ట్రములు బీహారు నుజూచి నేర్చుకొనవచ్చును. గాంధీయ సోషలిజమునకు బీహారు ఉద్భవస్థానము, వ్యాప్తిస్థానమునై యున్నది. ఉన్నతోన్నతులను మన నాయకులలో నొక్కని బీహారు మన మాతృదేశమునకు ప్రసాదించినది అని రాష్ట్రపతి తన వీడ్కోలు సందేశములో చెప్పుచున్నారు.

# హైద్రాబాదులో 3½ లక్షల 'దొంగ' రేషన్ కార్డులు

సికంద్రాబాద్, డిసెంబరు 7: సంస్థాన ప్రభుత్వ రేషన్ శాఖవారు ఒక్క హైద్రాబాద్ నగరంలోనే తిరిగి లెక్కలు తీసినప్పుడు మూడున్నర లక్షల దొంగరేషన్ కార్డులు పట్టుకొన్నారని నేడు అధికారరీత్యా తెలియవచ్చింది. ఇకనుండి వారానికి 7599 పల్లముల ఆహారధాన్యాలు మిగులుతవని అంచనా వేయబడింది. రేషన్ కార్డుల లెక్కప్రకారం హైద్రాబాద్ నగరజనాభా 12 లక్షలు. తిరిగి లెక్క తీసినప్పుడు యిది 8½ లక్షలకు దిగింది.

## రాంజీట్రాఫీ క్రికెటుపోటి

సికంద్రాబాద్, డిసెంబరు 7: హైదరాబాద్, మధ్యపరగణాల జట్లుకు డిసెంబరు 9న సికంద్రాబాద్ 'జింఖానా గ్రౌండ్సు'లో రాంజీ ట్రాఫీ క్రికెటు పోటీ జరుగుతుంది. మధ్యపరగణాలజట్టు రేపు యిక్కడకు వస్తున్నది.

# వాణిజ్య నౌకలకు నావికుల సేకరణ

## నియోగిగారి బిల్లుకు పార్లమెంటు ఆమోదం

న్యూఢిల్లీ, డిసెంబరు 7: ఇండియా పార్లమెంటు ఈ వేళ వాణిజ్యమంత్రి కె. సి. నియోగి ప్రవేశపెట్టిన నావికులకు సంబంధించిన బిల్లును ఏకగ్రీవంగా ఆమోదించింది. ఇండియాలోని అన్ని రేవు పట్టణాలలో నావికులకు ఉద్యోగాలకు సంబంధించిన ఆఫీసులు ఏర్పాటు చెయ్యడమే ఈ బిల్లు ఉద్దేశము.

దీనివల్ల ప్రస్తుతం నావికులను ఉద్యోగాలలోనికి తీసుకునే విషయంలో జరిగే లోపాలన్నీ తొలగి పోగలవని తెలుస్తున్నది.

అయితే నౌకా సంస్థల యజమానులు, కార్మికుల ప్రతినిధులు కలిసి సంఘాలు ఏర్పరుచుకుంటే దానికి భారతప్రభుత్వం ఎల్లాంటి అభ్యంతరమూ చెప్పబోదని కె.సి. నియోగి అన్నారు.

కె. సి. నియోగి ఈ విషయంలో మాట్లాడుతూ ఇంకా ఇల్లాగ అన్నారు." ప్రస్తుతం రేవుస్థలాలలో లక్షలకొలది నావికులు పనిపాటలేకుండా ఉన్నారు.

పూర్వం ఒకప్పుడు భారతప్రభుత్వం ఒక కమిటీని ఈవిషయంలో విచారణ చెయ్యవలసిందని ఏర్పాటుచేసింది. అయితే అప్పటి భారతప్రభుత్వం ఆకమిటీ సలహాలు కొన్ని ఆచరణలో పెట్టలేదు. 27 ఏళ్ల తరవాత ఇప్పుడు ఆ సలహాలను కొన్నింటిని భారతప్రభుత్వం అమలులో పెట్టాలని ఆలోచిస్తున్నది.

అయితే వాణిజ్య నౌకాసంస్థల యజమానులు, కార్మికుల ప్రతినిధులు కలిసి కార్మికులను ఎన్నుకొనే విషయంలో సంస్థలను ఏర్పరిస్తే వాటికి అన్నివిధాలా తోడ్పడగలము. అయితే ఆ సంస్థలు ప్రభుత్వ నియమాలకు లోబడి పనిచేస్తూ ఉండాలి. అదేగాక కొత్తగా కొంతమంది నావికులను తయారు చెయ్యవలెనని కూడా అనుకుంటున్నాము. వారికికూడా ఈ బిల్లువల్ల అన్నివిధాలా ఉపయోగం కలగ గలదని ఆశిస్తున్నాను."

ఆపిమ్మట అస్సామ్ ప్రతినిధి కులాధార్ చాలిహా మాట్లాడుతూ, ఈ బిల్లును తాము ప్రతిఘటిస్తున్నామనీ, ఈ బిల్లువల్ల లంచగొండితనము మొదలయినవి ఎక్కువ కాగలవనీ అన్నారు.

ఆ పిమ్మట ఎన్. జి. రంగా మాట్లాడుతూ, ఈ చట్టాన్ని తాము ఆమోదిస్తున్నామనీ, ఈ చట్టంలోని సూత్రాలు అనేక దేశాలలో, అమలులో ఉన్నాయనీ, మంచి నావికులను వాణిజ్యనౌకలలో చేర్చుకొనేటట్లు చూడాలనీ అన్నారు.

ఆ పిమ్మట ఒరిస్సా ప్రతినిధి బి. దాస్ మాట్లాడుతూ, దేశవిభజన జరిగిన చాలా మంది ముస్లిము నావికులను నియమించడం జరిగిందనీ, యుద్ధసమయంలో వీరంతా దేశద్రోహకరమైన పనులు చెయ్యకుండా జాగ్రత్తపడాలనీ అన్నారు. ఈ బిల్లువల్ల నావికులు ఏయే దేశాలకు చెందినవారో తెలుసుకోవడానికి కూడా వీలవుతుందని అన్నారు.

ఆ పిమ్మట అనంతశయనం అయ్యంగారు మాట్లాడుతూ, నావికులను తీసుకునే విషయంలో లంచగొండితనము మొదలైనవి లేకుండా చూడాలనీ, దీనికి సంబంధించిన సలహాసంఘంలో నావికుల ప్రతినిధులుకూడా ఉండడం మంచిదనీ అన్నారు.

ఆ పిమ్మట సవరణలతో సహా ఈ బిల్లును పార్లమెంటు ఆమోదించింది.

## నెలాఖరున ఢిల్లీలో ప్రత్యేక సమావేశం

బొంబాయి, డిసెంబరు 7: భారతనౌకా వర్తకాన్ని అభివృద్ధిచేయడానికి గాను దశవర్ష ప్రణాళిక తయారు చేయడానికి వాణిజ్యమంత్రి కే. సి. నియోగీ అధ్యక్షతను డిసెంబరు 26 నుండి మూడురోజుల పాటు న్యూఢిల్లీలో నౌకావర్తకుల సమావేశం జరుగుతుంది.

ఇండియా ప్రభుత్వంవారు నౌకావ్యాపారసంస్థలు నెలకొల్పాలా మన్నవివాదట ఏర్పడిన పరిణామాలు మూలంగా, వివిధ నౌకావ్యాపారస్థుల సమస్యలు చర్చించి రాగల పదేళ్ళ కాలానికిగాను ఒక ప్రణాళిక నిర్ణయించడం తప్పనిసరి అయింది.

ప్రభుత్వంవారు అన్ని ప్రభుత్వశాఖలకు సంబంధించిన ఒక ... రాగల సమావేశంలో ఇండియా అవ...

# బెంగుళూరుకు నగర ప్రతిపత్తి

## కార్పొరేషన్ సమారంభం

బెంగుళూరు, డిసెంబరు 8: నేడు బెంగుళూరుకు కార్పొరేషను ఏర్పాటు కావడంతో అది ఇండియాలోని ప్రధాన నగరాలలో ఒకటి అయింది.

మైసూరు ప్రధానమంత్రి కే. సి. రెడ్డి నేటియుదయం కార్పొరేషను సమారంభోత్సవం చేశారు.

కార్పొరేషనుకు శుభం ఆకాంక్షిస్తూ గవర్నరుజనరలు రాజగోపాలాచారీ ప్రధాని నెహ్రూ సందేశాలు పంపారు.

అందానికీ, శుచికీ బెంగుళూరు జనీవాతో పోల్చబడుతున్నది. ఇప్పుడీనగరం విస్తీర్ణం 30 చదరపుమైళ్లు. జనాభా దాదాపు ఏడులక్షలు. కార్పొరేషనుసాలుసరి ఆదాయం 72 లక్షలుంటుంది.

ఇంతవరకు బెంగుళూరుకూ కంటోన్మెంటుకూ ప్రత్యేక పురపాలనలుండేవి. ఇండియా స్వతంత్రం అయేటప్పుడు బ్రిటిషువారు కంటోన్మెంటును మైసూరు సంస్థానానికి తిరిగి ఇచ్చారు. ఈ రెండూ ఇప్పుడు ఏకీకరించబడినవి. 75 సభ్యులు గల కార్పొరేషనుకు కొత్తఎన్నికలు జరిగేదాకా ఉభయ పురపాలకసంఘాల సభ్యులూ పురపాలన సాగిస్తారు. బెంగుళూరు పురపాలక సంఘాధ్యక్షుడు ఆర్. సుబ్బన్న (వయస్సు 88) బెంగుళూరుకు మొదటి మేయరు.

### బెంగుళూరు పూర్వచరిత్ర

1537లో విజయనగరం మహారాజుల కాలంలో మాగడికి చెందిన కెంపెగౌడ అనే సేనాని బెంగుళూరు స్థాపించి, ఈ పట్టణం చాలా అభివృద్ధి చెంది ఇంతవరకు విస్తరించ గలదని చెప్పాడట. ప్రస్తుత బెంగుళూరు నగరం ఆయన సూచించిన హద్దులు దాటి పోయింది. ఔరంగజేబు కింద సేనానిగా ఉండిన కాసింఖాన్ బెంగుళూరును కెంపెగౌడ వద్దనుండి స్వాధీన పరచుకొన్నాడు. అతని వద్దనుండి మైసూరుకు చెందిన వొడయార్లు (రాజులు) మూడు లక్షల రూపాయలకు 1687 లో కొన్నారు. నాటినుండి బెంగుళూరు మైసూరురాజ్యంలోనే ఉన్నది.

1807 లో మైసూరు సంస్థానంవారు బెంగుళూరు సమీపంలోగల తొమ్మిదివేల ఎకరాల మేరను సైనికశిబిరం స్థాపించే నిమిత్తం బ్రిటిషువారి కిచ్చారు. ఇక్కడ చక్కని కంటోన్మెంటు నిర్మించబడింది. బ్రిటిషు రెసిడెంట్లు ఇక్కడ పురపాలన నిర్వహించారు.

ఇటీవల బెంగుళూరు పట్టణం చాలా చురుకుగా విస్తరించింది. ఈ విస్తరణ సక్రమంగా జరగడంకొరకు పేటలు నిర్మించబడినవి. బెంగుళూరు నగరాన్ని ఆనుకొని జలహళ్లివద్ద రాయల్ విమాన శాఖ వారి శిక్షణ కేంద్రం ఉన్నది. అక్కడే హిందూస్థాన్ ఎయిర్ క్రాఫ్టు ఫాక్టరి, ఇటీవలనే ఆరంభమైన ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ కూడా ఉన్నవి. బెంగుళూరు సమీపంలో త్వరలోనే మెషీన్ టూల్ ఫాక్టరీ కూడా నిర్మించబడనున్నది.

ఓ. ఎస్. భావ్యం చెట్టిగారు కార్పొరేషను విద్యాస్థాయి సంఘాధ్యక్షులుగా ఎన్నికోబడిరి.

లకుగాను ఏర్పాటు చేయదగిన అత్యధిక వాణిజ్య నౌకాబలం నిర్ణయించబడుతుంది. ప్రస్తుతం ఇండియాకు రెన్నర లక్షల టన్నుల నౌకలు మాత్రమే ఉన్నవి. ప్రపంచ వాణిజ్య నౌకాబలంలో ఇది వెయ్యింట ఆయిదు వంతులు మాత్రమే.

పర్షియన్ గల్ఫునుంచి కరాచీ వరకు గల వర్తక మార్గంమీద పడవలు నడిపే అధికారాన్ని బొంబాయి స్టీమ్ నేవిగేషన్ కంపెనీ వారికికూడా ఇవ్వాలని గత అక్టోబరులో ఇండియా ప్రభుత్వం నిర్ణయించి, ఆ వర్తక మార్గంమీద పోటీ లేకుండా వ్యాపారం సాగించే బ్రిటిషు నౌకా సంస్థవారితో సమాలోచనలు ఆరంభించారట. ఈ విషయమై కూడా రాగల సమావేశంలో నిర్ణయం జరుగుతుంది.

వర్తక నౌకలకు సంబంధించిన వివరాలు సేకరించడానికీ, నౌకా వర్తకులకు ప్రాతినిధ్యం వహించడానికిగాను ఒక డిపార్టుమెంటు నెలకొల్పడం గురించికూడా రాగల సమావేశం చర్చిస్తుంది. ఇటువంటి డిపార్టుమెంటు లేనికొరతను గురించి భారత వాణిజ్య నౌకా విధాన సంఘంవారు విమర్శించి ఉన్నారు. ఈ సందర్భంలో అనేక పథకాలు ప్రభుత్వానికి సమర్పించబడినవట. రాగల సమావేశంలో వీటన్నిటిపై సమగ్ర చర్చజరిగి అంతిమ నిర్ణయం చేయబడుతుంది.

ఈ సమావేశంలో ఇండియా ప్రభుత్వ వాణిజ్య నౌకాశాఖ డైరెక్టరు జనరలు ఆర్. ఎస్. లాల్, సింధియా స్టీమ్ నేవిగేషన్ కంపెనీ, బొంబాయి స్టీమ్ నేవిగేషన్ కంపెనీ, మొదలైన వాణిజ్య నౌకా సంస్థల ప్రతినిధులు పాల్గొంటారు.

# 'కర్నాటకరాష్ట్రం ఏర్పడువరకు బళ్లారి జిల్లాను పూర్తిగా ఆంధ్రరాష్ట్రంలో చేర్చాలి'

## బళ్లారిజిల్లా కాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం

ఆదోని, డిసెంబరు 7: కర్నాటకరాష్ట్ర నిర్మాణమగువరకు బళ్లారిజిల్లాను విభజించక ఉన్నదున్నట్లుపూర్తిగా ఆంధ్రరాష్ట్రములో చేర్చవలెనని బళ్లారిపట్టణ రేటు పేయర్ల సంఘమువారు చేసిన తీర్మానమును బలపరుస్తూ టి. జి. తిమ్మయ్యచెట్టిగారి అధ్యక్షతను మొన్న యిక్కడ జరిగిన బళ్లారిజిల్లా కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో తీర్మానించారు.

దీనికి పప్పూరి రామాచార్యులు (అనంతపురం) ఎస్. రామిరెడ్డి (ఆం. కా. కార్యవర్గసభ్యులు) బి. శంకర రెడ్డి గారలు హాజరయ్యారు. 1921 లో కేల్కారుగారు ఇచ్చిన తీర్పులోనున్న తెనుగు ప్రాంతమునంతటిని, ఇప్పుడు రానున్న ఆంధ్రరాష్ట్రములో వెంటనే చేర్చవలసినదిగా మద్రాసు ప్రభుత్వము వారిని కోరుతూ ఇంకొక తీర్మానంచేశారు.

మద్రాసు ప్రభుత్వము ఋణము గా రైతులనుండి ఒక్క ఏడాది శిస్తును ముందుగా వసూలుచేయవలెనను ఆర్థిక మంత్రి సలహాను, ఈసంఘమువారు ప్రతిఘటించుచు ఇది రైతులకు అనర్థదాయకముగా పరిణమించగలదనియు రాయలసీమ బీదరైతులు ముందుగా ఇచ్చుకోజాలరనియు అనవసర అధికారవర్గమును, శాఖలను తగ్గించుట మూలముగా బడ్జెటులోని లోటును పరిపుచ్చుకోవలసినదనియు కోరుతూ వేరొక తీర్మానం చేశారు.

బళ్లారిజిల్లా వరదబాధితులపట్ల సానుభూతి తెలియజేశారు. స్వ. వి.

# "ఐక్యరాజ్య సమితి సూత్రాలకే విజయం"

## మైఖేల్ స్కాట్ సమీక్ష

ఫ్లషింగ్ మెడోస్, డిసెంబరు 6: నైరృతి ఆఫ్రికా విషయమై జనరల్ అసెంబ్లీ చేసిన తీర్మానములను గూర్చి ప్రస్తావిస్తూ రెవరెండు మైఖేల్ స్కాట్ ఈ విధంగా చెప్పెను: "ఐక్యరాజ్య సమితి సూత్రాలకే చివరకు విజయం లభించింది. దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వం ఆదిమవాసులమొక్క తన నిధి భాగ్యతలను ఇకపైనా గుర్తెరిగి న్యాయంగా ప్రవర్తించ గలదని విశ్వసిస్తున్నాను." ధర్మకర్తృత్వ సంఘంఎదుట స్కాట్ చేసిన ఉపన్యాసాన్ని ప్రశంసిస్తూ అనేకమంది ప్రతినిధులు ఆయనను అభినందించిరి. దక్షిణ ఆఫ్రికా ఈ వివాదలో గెలవలేక దానిని మైకేల్ స్కాట్ వ్యక్తిగత వివాదకిందకు దింపిందనీ, అలాదింపినా చివరకు తానే ఓడిపోయిందనీ, కొంతమంది ప్రతినిధులు వ్యాఖ్యానించిరి.

ధర్మకర్తృత్వ సంఘంలో తీర్మానాలను జయప్రదంగా నడుపుకొని వచ్చిన శ్రీ బి. శివరావుగారు ఈ విధంగా అన్నారు: "సమితిచేసిన రెండు తీర్మానాలు ఇండియాకు చాలా సంతృప్తికరంగా ఉన్నవి. ఈతీర్మానాలను దక్షిణ ఆఫ్రికా యెడ ద్వేషభావంతో మేము ప్రవేశపెట్టలేదు. కొన్ని మూల సూత్రాలను ఒక రాజ్యం నిర్లక్ష్యం చేస్తూఉంటే, చూస్తూ ఊరుకోవడం సాధ్యంకాదు. ఈ సమావేశంలో మధ్యప్రాచ్య దేశాలూ లాటిన్ అమెరికా దేశాలూ పరాధీన ప్రజల హక్కులపట్ల, మునుపటికన్న ఎక్కువ సానుభూతి ప్రదర్శించారు, ఇదే ఈ సమావేశంలో ప్రధానంగా గమనించవలసిన అంశం అని నా అభిప్రాయం."

## దక్షిణాఫ్రికా ప్రతినిధి విజ్ఞప్తి

ఫ్లషింగ్ మెడో, డిసెంబరు 7: నైరృతి ఆఫ్రికా సమస్యను అంతర్జాతీయ న్యాయస్థానానికి నివేదించవలెనన్న తీర్మానం ఈవేళ సమితిలో చర్చకు వచ్చినప్పుడు తీర్మానం నెగ్గడానికి మూడింట రెండు వంతుల మెజారిటీ రావలెనని, రూలింగు ఇవ్వవలసిందని దక్షిణ ఆఫ్రికా ప్రతినిధి జూస్ట్ అధ్యక్షుణ్ణి కోరెను.

వెనుక ఇలాగే దక్షిణ ఆఫ్రికా భారతీయుల సమస్యను అంతర్జాతీయ న్యాయస్థానానికి నివేదించవలెనని ఒక ప్రతిపాదన జరిగిందనీ, ఆ సందర్భంలో అధ్యక్షుడు ప్రతిపాదన నెగ్గడానికి మూడింట రెండువంతులు మెజారిటీ రావాలని రూలింగు ఇచ్చెననీ జూస్ట్ ఉదాహరించెను.

కాని అధ్యక్షుడు జూస్ట్ వాదాన్ని స్వీకరించలేదు.

# హైద్రాబాద్ ఆహార పరిస్థితి

## సప్లయి మంత్రి వివరణ

హైద్రాబాద్, డిసెంబరు 7:— హైద్రాబాద్ సప్లయి మంత్రి పి. హెచ్. కృష్ణరావుగారు గతరాత్రి డక్కన్ రేడియోలో ప్రసంగిస్తూ, సంస్థానం ఆహార క్లిష్టస్థితినుండి గట్టెక్కినదన్నారు. అయితే పరిస్థితి సంపూర్ణమైన తృప్తికరంగా నున్నట్లు చెప్ప వీలు లేదన్నారు. ఎందుచేతనంటే ప్రస్తుతం గొదాములలో నున్న ఆహార పదార్థాల నిల్వ అంతా గతసంవత్సరం ఉన్నదానిలో సగం మాత్రమే ఉన్నదన్నారు. వచ్చే సంవత్సరం ఆహారస్థితి యిప్పటికంటే చాలా బాగుగా ఉండే అవకాశ మున్నదన్నారు.

హైద్రాబాద్ ప్రభుత్వ అధికాహారోత్పత్తి త్రివర్ష ప్రణాళిక కింద స్థానికంగా ఎరువులను అభివృద్ధి చెయ్యటం జరుగగలదన్నారు. వ్యవసాయదారనికి తగినన్ని వ్యవసాయ పరికరములు సప్లయి చెయ్యటానికి తగు చర్యలు తీసుకోబడుతున్నవన్నారు. వ్యవసాయంలో బాగా అనుభవమున్న వ్యక్తులతోటి ఆహార సలహా సంఘం పునర్నిర్మాణం చెయ్యబడుతున్నదన్నారు.

కృష్ణారావుగారు సంస్థానంలో ప్రత్తి పంట నధికం చెయ్యవలసిన ఆవశ్యకతను ఉద్ఘాటించారు. బొంబాయిలో యిటీవల జరిగిన ప్రత్తి అభివృద్ధి సంఘ సమావేశములో హైదరాబాదు ప్రత్తిపంట నభివృద్ధి చెయ్యవలెననీ, సంస్థానంలో వచ్చే సంవత్సరం పండించే భూమిని 27 లక్షల యకరాలకు పెంచవలెననీ నిర్ణయం చెయ్యబడినదన్నారు.

## నల్గొండ జిల్లా చేనేత కాంగ్రెస్ సంఘం

సూర్యాపేట, డిసెంబరు 7: నల్గొండ జిల్లాలోని చేనేత కాంగ్రెస్ ప్రముఖులు హైద్రాబాద్ సంస్థాన చేనేత కాంగ్రెస్ అధ్యక్షులు కొండా లక్ష్మణ్ గారి అధ్యక్షతను సమావేశమై నల్గొండ జిల్లా చేనేత కాంగ్రెస్ సంఘమును స్థాపించి అధ్యక్షులుగా రావిటి దత్తగణేశ్వర సిద్ధాంతి గారిని ఎన్నుకొనిరి. ఉపాధ్యక్షులుగా ఎ. వీరయ్య, కార్యదర్శిగా ముత్యాలు వెంకటాద్రి, ఎం. నర్సయ్య, కోశాధిపతిగా ఎ. వీరయ్యగార్లు ఎన్నుకోబడినారు.

## మానుకోటలో మార్కెటు స్థాపన

మానుకోట, డిశంబర్ 7: నేడు ఇక్కడ ప్రభుత్వమార్కెటు స్థాపించబడింది, దీనిని జిల్లాసివిల్ పరిపాలనాధికారి పళని యప్పన్ గారు ప్రాగంభోత్సవం జరిపారు.

## మేజర్ జనరల్ చౌదరీ

గ్వాలియర్, డిశంబరు 7: హైద్రాబాద్ మాజీ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌధరిగారు నిన్న యిక్కడకు వచ్చారు. ఈయన యిక్కడ మధ్యభారత సమాఖ్య రాజప్రముఖ్ సింధియా మహారాజు అతిథిగా 15 రోజులు ఉంటారు.

# 8 మంది పోలీసుల హత్యకేసు విచారణ

## 27 గురు ముద్దాయిలకు యావజ్జీవ కారాగారవాసశిక్ష

హైదరాబాద్, డిసెంబర్ 7: 1948 సెప్టెంబరు 30 న 8 మంది పోలీసులను హత్యచేసినారన్న నేరానికిగాను మేదక్ జిల్లా అడిషనల్ సెషన్సు జడ్జిగారు నిన్న 27 గురు ముద్దాయిలకు యావజ్జీవ కారాగారవాసశిక్ష విధించారు. మొట్టమొదట 30 మందిమీద నేరం ఆరోపించబడింది. కాని 27 మందిమాత్రమే అరెస్టుచేయబడి మాజిస్ట్రేటుఎదుట హాజరు పెట్టబడినారు. మాజిస్ట్రేటు వీరిని విచారించి కేసును సెషన్సులో విచారణకు పంపారు. సెషన్సు జడ్జి వారిని దోషులుగా నిర్ణయించి, యావజ్జీవ కారాగారవాసశిక్ష విధించారు.

ముద్దాయి అక్రమ సమూహంగాకూడి 1948 సెప్టెంబర్ 30వ తేదీ సాయంకాలం కలట్ గూర్ తాలూకాలోని ఫసల్వాడీ గ్రామంపై దాడిచేశారట. గౌసుద్దీన్ అనే పోలీసుఅధికారి నాయకత్వాన పోలీసులు ఆ గ్రామానికివెళ్ళి కోశ్యం చేసుకొన్నారు. ముద్దాయిలు యింకా కొంతమంది సహాయంతో పోలీసులను పట్టుకొని వారి కాళ్లుచేతులు తాటితోకట్టి తీవ్రంగా మోది అనంతరం మజీరానదిలో పారవేశారట.

సెషన్సుజడ్జిగారు తీర్పుచెప్పిన అనంతరం హైకోర్టువారి ఆమోదమునకు కేసునంతను పంపెను. ముద్దాయిల తరఫున ముర్తూజా అహమ్మద్ అన్సారీ గారు వాదించారు. ప్రాసిక్యూషన్ తరఫున మంసూర్ అహమ్మద్, ముర్తూజాఖాన్, ఖియా ముల్లాక్ గార్లు వాదించారు.

(స్వ. వి.)

## అజంతా ఎల్లోరా గుహలలో మరమ్మతు పనులు

హైద్రాబాద్, డిసెంబరు 7: భారత దేశంలో శిల్పకళాసంపదకు నిలయమైన అజంతా ఎల్లోరా గుహలలో మరమ్మతులు చేయబడుచుండుటచేత, యీ నెల 20 నుండి 26 వరకు వాటిని యాత్రికులు దర్శించుటకు అవకాశముండదు. గుహలకు దగ్గరలోనున్న అతిథిమందిరంలో కూడ మరమ్మతులు జరుగుతున్నవి.

## శ్రీరంగం యాత్రికులు ముందే కలరా ఇంజక్షనులు వేయించుకోవాలి

శ్రీ రంగం, డిశంబర్ 7: తిరుచినాపల్లి జిల్లాలో కలరా వ్యాపించి వున్నందున, ఈ నెల 21 నుండి వచ్చేనెల 11 వ తేదీవరకూ జరుగనున్న వైకుంఠ ఏకాదశి ఉత్సవాలకై శ్రీరంగం వచ్చే యాత్రికులందరూ, రావటానికి కనీసం వారం రోజుల ముందుగానైనా కలరా ఇంజక్షనులు వేయించుకొని రావలెనని శ్రీరంగం మునిసిపల్ ఆరోగ్యాధికారి ప్రజలకు సలహా యిస్తున్నారు.

## యల్లంకిలో పరమేశ్వర గ్రంథాలయ స్థాపన

సూర్యాపేట, డిసెంబరు 7: నల్గొండ జిల్లా యల్లంకి గ్రామంలో పరమేశ్వర గ్రంథాలయం స్థాపించబడింది. ఇందు సుమారు వెయ్యి తాళపత్ర, ఆంధ్ర, సంస్కృత, హిందీ, ఇంగ్లీషు గ్రంథములు ఏర్పాటు చేయబడినవి. దీనికి అధ్యక్షులుగ రావిటి దత్తగణేశ్వర సిద్ధాంతి, కార్యదర్శిగా పున్న సత్తెయ్యగార్లు నియమించబడిరి.

# ఆంధ్రతుపాను బాధితులకు కోయంబత్తూరు చేనేతవస్త్ర వ్యాపారుల సహాయం

కోయంబత్తూరు, డిసెంబరు 7: ఆంధ్రదేశంలో యిటీవల వచ్చిన ఘోర తుపాను వల్ల విపరీతంగా నష్టపడిన బాధితుల సహాయార్థం కోయంబత్తూరు చేనేత వస్త్ర వర్తకుల సంఘంలోని 44 గురు సభ్యులు 148 చేనేతచీరెలను మద్రాసు గవర్నరు తుపాను సహాయ నిధి కార్యదర్శిగారికి సంఘం ద్వారా పంపారు. ఈ చీరెలను అవసరమైనవారికి యివ్వవలసిందని వారు కార్యదర్శిగారిని కోరారు. చీరెలు విరాళమిచ్చిన సభ్యులపేర్లు. ఎస్. ఆర్. పి. పొన్నుస్వామి చెట్టియార్, భాస్కర టెక్స్ టైల్స్, ఎ. పెద్దన్న చెట్టికంపెనీ, సి. ఎస్. వి. చిన్నన్నచెట్టి, ఎస్. రాజప్పచెట్టి కంపెనీ ఎస్. ఎ. కె. నాజప్ప చెట్టి, కె. ధనంజయచెట్టి, దొరైస్వామి శెట్టి, ఎ. కె. సుబ్రహ్మణ్యచెట్టి కంపెనీ, ఎం. వి. ఎ.సి. ఈశ్వరి కంపెనీ, లోటస్ టెక్స్ టైల్స్, టి. పి. అయ్యాస్వామిచెట్టి, లక్ష్మీ టెక్స్ టైల్స్, పి. నాగిచెట్టి, బెల్లం ... సన్సు, కె. ఎస్. భద్రయ్య చెట్టి, అంబికా టెక్స్ టైల్స్, వసంత కంపెనీ, జె. నారాయణస్వామిచెట్టి కంపెనీ, కె. ఆర్. చొక్కయ్య బదర్సు, వి. ఎం. ఎస్. వీరి చెట్టి కంపెనీ, ఎస్. అరుణాచలంచెట్టి ఎస్. ఎస్. రాజుచెట్టి, ఎస్. రామస్వామి చెట్టి, ఎల్. అరుణాచలం బ్రదర్సు, ఎ. ఎస్. శ్రీనివాస్ కంపెనీ, సి. ఎస్. కె. చంద్రశేఖరచెట్టి కంపెనీ, ఎ. కె. అయ్యాన్నచెట్టి కొల్లిగల్, శ్రీనివాసచెట్టి సన్సు, ఎ. సి. పళనిచెట్టి సన్సు, పి. కుప్పరాజ్, వి. ఆర్. రత్నస్వామి, ఓగ్గా పి. సుబ్రహ్మణ్యచెట్టి, ఎస్.పి. వెంకటాచలంచెట్టి, ఎల్. వెంకటస్వామిచెట్టి, ఆర్. స్వామినాథ చెట్టి కంపెనీ, కె. ఎస్. పి. కంపెనీ వసంత గోపాలటెక్స్ టైల్స్, జి. వి. దొరైస్వామి, కుమారస్వామి మొదలియార్, ఎస్. వి. ఫ్రాన్సిస్, చెట్టియార్ సన్సు, సెయింట్ జోసెఫ్ శారీమార్టు, జోస్యం బసవయ్యచెట్టిసన్సు, ఎస్. శివవీరభద్ర చెట్టి, ఎం.ఎస్. ఆర్. రాజగోపాలచెట్టి సన్సు, ... రామస్వామి ... అయ్యాస్వామిచెట్టి, ... సౌదేశకంపెనీ.

# వివిధ దేశాలలో ఆహార ధాన్యాల మిగులు తగులు విచారణ

## 14 రాజ్యాలసభ్యులతో ప్రత్యేకసంఘం: అంతర్జాతీయ వ్యవసాయ సంఘ నిర్ణయం

వాషింగ్టన్, డిశంబర్ 6: నేటి, ఐక్యరాజ్యసమితి ఆహార వ్యవసాయ సంఘ సమావేశంలో, ఆయా దేశాలలోని ఆహారధాన్యాల మిగులు తరుగులను గురించి విచారించటానికి 14 దేశాల సభ్యులతో ఒక ప్రత్యేక సంఘాన్ని స్థాపించటానికి నిర్ణయించారు. లోగడ ఒక అంతర్జాతీయ కొనుగోలు సంస్థను స్థాపించి తద్వారా ఆయా దేశాలకు ఆహారధాన్యాలు అందజేయాలన్న ప్రయత్నాన్ని ప్రస్తుతానికి విరమించుకున్నారు.

ముగింపు సమావేశంలో డైరెక్టర్ జనరల్ నారిస్ డాడ్ ప్రసంగించుచూ: 'తిండీ, గుడ్డా, తలదా చుకోవటానికి కొంపా లేకుండా అల్లాడు లక్షోపలక్షల జనానికి, సానుభూతి చూపటం మినహా ఈ సంస్థద్వారా మనం చేసిన సహాయం ఈ షణమాత్రమైనా లేదు. ప్రతినిధి దేశాలే ... సావకాశమేమీ కనుపించటం లేదు అన్నారు.

ఈ మిగులు తరుగుల విచారణసంఘంలో ఈ దిగువ దేశాలు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి:

బ్రెజిల్, ఉరుగ్వే, క్యూబా, అమెరికా, కెనడా, యీజిప్టు, పాకిస్థాన్, బ్రిటన్, ఫ్రాన్సు, నెదర్లాండ్సు, పోలండ్, ఆస్ట్రేలియా, ఇండియా, ఇండోనీషియా. ఈ ప్రత్యేక సంఘం ప్రథమ సమావేశం 1950 ఆరంభంలో వాషింగ్టన్ లో జరుగుతుంది.

ఈ సమావేశంలో, కార్యాలయాన్ని రోముకు మార్చటంలో కలిగే సమస్యలను సమగ్రించటానికిగాను ఒక కార్యాలయ సలహా సంఘాన్ని కూడా నియమించారు. దీలో బ్రిటన్, ఫ్రాన్సు, స్విట్జర్లండ్, ఇండియా, మెక్సికో, చైనా దేశాలు ప్రాతినిధ్యం వహిస్తున్నవి.

టెండరు

## ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే

"నార్తు వెస్టు లైనుమీద జక్కుల చెరువు స్టేషనువద్ద 2" కంకర రాయి సప్లయి చేయుటకు" సీలు చేసిన టెండర్లు మద్రాసులోని ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే, చీఫ్ యింజనీరుగారిచే 28-12-1949 తేది బుధవారము పగలు 12 గంటల వరకు తీసుకొనబడును.

సెట్టు 1-కి పదిరూపాయల వంతున రొక్కము చెల్లించి, దరఖాస్తు చేసినచో, టెండరు ఫారములు, యితర డాక్యుమెంట్లు జారి చేయబడును.

టెండరు 1-కి రు 500/-లు వంతున ముందుగా ధరావతు సొమ్ము చెల్లించవలెను.

పని విలువ సుమారు రు 23,400/-లు.

టెండరు నోటీసు

## చిత్తూరు జిల్లాలో గవర్నమెంటు వైద్యసంస్థలకు ఆహారపదార్థములు ఆస్పత్రి యితరసామానులు సప్లయి చేయుటకు టెండరు నోటీసు

క్రిందుముఖమున తెలియపరచునదేమనగా, చిత్తూరులోని గవర్నమెంటు డిస్ట్రిక్టు హెడ్ క్వార్టర్సు ఆస్పత్రికి, మదనపల్లి, తిరుపతి, పలమనేరు, కాళహస్తి, తిరుత్తని డివిజనల్ సెంటర్లలోని గవర్నమెంటు వైద్య సంస్థలకు 1-4-1950 నుండి 31-3-1951 వరకు కావలసిన ఆహారపదార్థములు, ఆస్పత్రి యితర సామానులు సప్లయి చేయుటకు సీలువేసిన టెండర్లు 3-1-1950 మంగళవారము మధ్యాహ్నము 2 గంటల వరకు ఆ యా ఆస్పత్రుల సూపరింటెండెంట్లచే తీసుకొనబడును. ఒక రూపాయి చెల్లించి ఆ యా సూపరింటెండెంట్లనుండి, టెండరు షరతుల అచ్చుకాపీలు, కావలసిన వస్తువుల షెడ్యూలు, రెండు కాపీలు టెండరు ఫారములు పొందవచ్చును. XXVII మెడికల్ - మిస్ లేనియస్ హెడ్ క్రింద మద్రాసులోని రిజర్వు బ్యాంక్ ఆఫ్ యిండియాలో గాని, ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ యిండియా తాలూకు యే బ్రాంచీలో గాని, గవర్నమెంటు యే ట్రెజరిలో గాని మద్రాసు గవర్నమెంటు ఖాతాను సదరు రుసుము జమకట్టి ఆ చలాను చూపించి ఫారములు పొందవలెను.

రొక్కముగా చెల్లించినచో అంగీకరింపబడదు.

టెండరు పెట్టదలచిన ప్రతి టెండరుదారు, తనకు స్థిరాస్తులు వున్న రెవిన్యూ జిల్లాయొక్క తహసీలుదారు సంతకముగల సాల్వెన్సీ సర్టిఫికెటును టెండరులో జతపరిచి 3-1-1950 తేదిన పంపవలెను.

డా. హెచ్. ఎస్. సుబ్రహ్మణ్యం,
ఎం. బి, బి. ఎస్., ఎం. ఎం ఎస్.
డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసర్, చిత్తూరు.

## రిజిస్ట్రేషను రుసుము మార్పు

### మదరాసు ప్రభుత్వం వారి క్రొత్తచట్టం

మదరాసు, డిశంబరు 8.- మదరాసు సిటీ మునిసిపాలిటీలు, స్థానికసంస్థచట్టములకు సవరించుబిల్లు ప్రభుత్వంవారు ప్రకటించిరి. అందలి కారణోద్దేశములందు యిట్లు తెలిపిరి -

మునిసిపలు ప్రాంతాలందున్న స్థిరాస్తులు విక్రయించునపుడు, తనఖా పెట్టునపుడు, దానం చేయునపుడు స్థానికసంస్థలకు రుసుముచెల్లించుటకు 136 సెక్షన్, 116 ఎ. 110 ఎ సెక్షనులందు అవకాశం గలదు. ఆ సెక్షనులు ఆస్తులు ఒకరివద్దనుండి యింకొకరికి మార్పుకొన్నపుడు వర్తించవు. అందుచే రుసుము తప్పించుకొనుటకు డాక్యుమెంటులలో స్థిరాస్తులు చిన్నవిగా చూపి, ఎక్కువ నగదు మార్పుకొనుచున్నారు. కనుక అటువంటి మార్పులకు, చిరకాలం బాడుగకు తీసుకొనే ఆస్తులకు గూడ రుసుము వసూలుచేయు అధికారం యిస్తూ, మదరాసు మునిసిపాలిటీ, జిల్లా మునిసిపాలిటీలు, స్థానికసంస్థల చట్టములందలి పై సెక్షనులు మార్పుచేయుటకు యీ సవరణబిల్లు ప్రకటింపబడినది.

### పరిపాలనాశాఖల విభజన

ప్రవీణులసంఘముల ఏర్పాటు

మదరాసు, డిశంబరు 8 - ఆంధ్రరాష్ట్ర నిర్మాణసందర్భమున విభజనసంఘమునకు సలహాలిచ్చుటకుగాను పరిపాలనా విషయములు తెలిసిన ఉద్యోగులతో ఆయావిషయములకు ప్రవీణసంఘములను నియమించెదరని తెలియుచున్నది.

# అనంతపురం జిల్లాబోర్డు ప్రథమ సమావేశం

## 1950-51 బడ్జెటు అంచనాలామోదం

అనంతపురం, డిసెంబర్ 7: ఎన్నికల యనంతరము ప్రప్రథమముగా అనంతపురము జిల్లాబోర్డు నిన్న మధ్యాహ్నం బోర్డు అధ్యక్షులు కె. వి. వేమారెడ్డిగారి అధ్యక్షతన సమావేశమైనది. ఇందులో 49-50 సం॥రపు క్రొత్త బడ్జెటు, 50-51 బడ్జెటు అంచనాలు అంగీకరింపబడెను.

రాష్ట్ర మద్యనిషేధ శాఖామాత్యులకు నీలం సంజీవరెడ్డిగారికిని, ఆహార శాఖామాత్యులు రోచి విక్టోరియాగారికిని సన్మానపత్రము లర్పించుటకు తీర్మానించారు.

కల్యాణదుర్గం పంచాయతీబోర్డును రద్దుచేయు విషయమై మూడునెలలు గడువు ఇవ్వవలసినదిగాను, కదిరిలో మలేరియా పరిశోధన ఖర్చుఅంతయు ప్రభుత్వమే భరించవలెననియు, గుత్తి లోకల్ ఫండు ఆస్పత్రిని ప్రభుత్వ ఆస్పత్రిగా స్వీకొనవలెననియు కోరుతూ తీర్మానాలు చేశారు.

బడ్జెటు తీర్మానము చర్చకు వచ్చినపుడు ఒక్కొక్క అంశమునకును ప్రత్యేకముగా చర్చ జరగవలెనని కొందరు సభ్యులు కోరిరి. కాని అధిక సంఖ్యాకులచే బడ్జెటు ఆమోదింపబడెను.

ఈ క్రొత్త బడ్జెటు అంచనాలలో గ్రామ వైద్యాలయములకు భవనము లు నిర్మించుటకు 20,000, క్రొత్త వైద్యాలయములు ఆరు ప్రారంభించుటకు 14,000, మార్కెట్ల అభివృద్ధికి 10,000 ప్రత్యేకింపబడెను. యాడికి, బుక్కపట్టం గ్రామములలో నూతనముగా హైస్కూళ్లు స్థాపించుటకును, ఈ సంవత్సరమే ప్రారంభింపబడియుండు వాటిలో క్రొత్త తరగతులు ఆరంభించుటకును అవకాశము కల్పింపబడియున్నది.

జిల్లాబోర్డుకు సంబంధించిన, విద్య, వైద్యము రోడ్లు ఆరోగ్యము విషయముల యందు బోర్డుకు సలహా లిచ్చుటకు వేర్వేరు కమిటీలు ముందునాడే ఎన్నుకొనబడెను. ఒక్కొక్క కమిటీయందు ఒక్కొక్క స్వతంత్ర సభ్యునికి గూడ స్థాన మివ్వబడెను ఈ క్రిందివారు ఆయా కమిటీల కెన్నుకొబడిరి.

విద్యాసంఘము: ఎ. చిదంబరరెడ్డి, బి. రామిరెడ్డి, పి. అప్పిరెడ్డి, జి. వెంకన్న, కె. విరుపాక్షప్ప, ఆర్. కె. నాగేశ్వరరావుగారలు. వైద్యసంఘము: ఎ వెంకరప్ప, డి సుబ్బారెడ్డి, నారపరెడ్డి, చౌడిరెడ్డి, సంజా నారాయణప్ప, అశ్వత్థ నారాయణరెడ్డిగార్లు. ప్రజా ఆరోగ్య సంఘము: పర్వతయ్య, బి. రంగారెడ్డి, కదిరప్ప, చి. లక్ష్మీనారాయణ, కుళ్లాయప్ప, ముష్కిన్ సాబు పబ్లిక్ వర్క్సు: పి. బియన్న, యస్. నాగిరెడ్డి, బి. కె. రమణప్పశెట్టి, సత్యనారాయణరెడ్డి, సిద్దారెడ్డి, శివారెడ్డిగార్లు. (స్వ. వి)

# "సింధియా కంపెనీ నష్టపడటానికి బాధ్యత కార్మికులది కాదు"

## కార్మిక యూనియన్ అధ్యక్షుడు గౌతు లచ్చన్నగారి ప్రకటన

### కొంత సిబ్బందిని తగ్గించటానికి కార్మికులు ఒప్పుకోవాలని యజమానుల ఒత్తిడి

విశాఖపట్నం, డిసెంబరు 7: విశాఖపట్నం నౌకా నిర్మాణశాలను నడిపించటానికి, సింధియా కంపెనీ యజమానులు, భారతప్రభుత్వంవారు మార్గాల నన్వేషిస్తున్నారని, ఇటీవల కంపెనీ ప్రధాన పరిపాలకుడు దండేకర్, ప్రధాన మేనేజరు ఎస్. జె. పాండ్య చేసిన ప్రకటనలకు మేము హర్షిస్తున్నా, నిర్మాణశాలా నిర్వహణను పీలుకలుగ జేయవలసిన బాధ్యతను యావత్తూ కార్మికులపైనే మోపుతున్నందుకు తాము చాలా చింతిస్తున్నామని కార్మిక యూనియన్ అధ్యక్షుడు గౌతు లచ్చన్న (ఎమ్. ఎల్. ఏ) గారు ఒక ప్రకటన చేస్తున్నారు.

ఆయన ఇంకా ఈ విధంగా అంటున్నారు.

"కంపెనీయొక్క ఆర్థికదుస్థితికి కార్మికులే ముఖ్యకారకులని ధ్వనించేటట్లు, కార్మికులనే ఎక్కువ త్యాగం, సహకారము చేయవలెనని యజమానులు ఉద్బోధిస్తున్నారు.

నిన్న నేను, కార్మికుల, ఉద్యోగుల ప్రతినిధులతో కలిసి దండేకర్ గారితో సంభాషించాను. అప్పుడుకూడా, ఈపరిశ్రమను నిలబెట్టవలెననే త్యాగబుద్ధితో, దేశభక్తితో, కార్మికులు ముందుకువచ్చి, తమలో కొందరిని తొలగించుటకు అంగీకరిస్తే నేగాని, ఈ పరిశ్రమను నడపటం సాధ్యంకాదని దండేకర్ మళ్లీ నొక్కి చెప్పారు. నౌకా పరిశ్రమ నిలబడుతుందా, పడిపోతుందా అనే విషయం కార్మికుల నిర్ణయంమీదనే ఆధారపడివుందని కూడా ఆయన అన్నారు.

నిర్మాణశాలలో కార్మికులు అవసరమైనంతకంటే ఎక్కువవున్నారనీ, అందువల్లనే ఆర్థిక నష్టం కలిగిందనీ దండేకర్ గారు పొరబాటుగా అభిప్రాయపడ్డారు. శాలలోని ఏ భాగాలలోను పని మొదలు పెట్టబడితేనేగాని, ఇంతమంది కార్మికులు అక్కరలేదని కూడా ఆయన అన్నారు. ఇది నిరాధార అభిప్రాయం. ఎందువల్లనంటే, శాలలోని రెండు భాగాలలో మాత్రమే పనిజరుగుతున్న కాలంలోకూడా కార్మికులు ఊపిరిసలపని పనిచేశారు. రాత్రిళ్లు, ఆదివారాలుకూడా పనిచేస్తూనే వున్నారు. కనుక న్యాయప్రకారం ఇంకా ఎక్కువమంది కార్మికులను చేర్చుకోవాలి.

నౌకలనుగూర్చి చెబుతూ, రెండవ, మూడవ నౌకలైన జలప్రభ, జలప్రకాష్ లు ఏ ఇతర దేశాలలో తయారైన నౌకలకు తీసిపోవని దండేకర్ గారే ఒప్పుకున్నారు. కాని నాల్గవ నౌక జలపంభి మాత్రం ఎక్కువ డబ్బు మింగిందని, ఆయన చెప్పారు. దీనికి మేము సమాధానమిస్తూ, జలపంభికి ఎక్కువ డబ్బు ఖర్చు అవటానికి కార్మికుల బాధ్యత ఏమీ లేదన్నాము. దానిబాధ్యతఅంతా కంపెనీ యజమానులదేనని, ఇక నౌకలను నిర్మించబోవటం లేదనే నిశ్చయంమీద ఆధారపడి జలపంభి నిర్మాణమును యజమానులు శాశ్వాలని 1949 మార్చినుండీ తాపీగా చేస్తూవచ్చారనీ, మేము చెప్పాము. శాలలోని రెండు భాగాలకు ఉద్దేశింపబడిన కార్మికబలగాన్ని అంతటినీ ఒక్క జలపంభిలో నమేవారు వినియోగించారు. ఇంత కార్మికులబలగమున్నా వారు దానిని సరిగా ఉపయోగించుకోలేక పోయారు కంపెనీకివచ్చిన నష్టాలకు కార్మికుల సంఖ్యకు సంబంధంలేదన్న విషయాన్ని మేము ఏనిష్పాక్షిక సంఘం ఎదుటనైనా ఋజువు చేయగలమని దండేకర్ గారితో అన్నాము. దానికాయన జరిగి పోయిన దాన్ని గూర్చి మనమెన్ని వాదనలు చేస్తే మాత్రం లాభమేమిటి లెండన్నారు.

ఇండియాలోని కార్మికులకు ఇంగ్లండులోని కార్మికులకిచ్చే జీతంలో సగంమాత్రమే ముట్టుతున్నది. కంపెనీవారు అడపాతడపా చేసే ప్రకటనలు, వివిధ దర్యాప్తు సంఘాల అభిప్రాయాలు పరిశీలిస్తే విశాఖపట్నం నౌకా కార్మికుల సామర్థ్యంచాలా సంతృప్తికరమని తెలుస్తుంది. వారి సామర్థ్యమునకు టెక్నికల్ సైపుణ్యానికి ఒకదు రేమిటంటే, వారు నిర్మించిన నౌకలను లాయిడ్స్ రిజిస్టర్లలో మొదటి తరగతి వానిగా గుర్తించారు. ఈ పరిశ్రమను బాల్యావస్థనుచూసి, దాని విజయమునకు ఇండియావంటిదేశం నిజంగా గర్వించవచ్చు.

కాని ఒకశోచనీయ విషయమేమిటంటే కార్మికులను త్యాగంచేయవలసిన జీవులుగాను, ఎప్పుడూ తప్పులుచేసేవారుగాను పరిగణించటం నిజంగా ఈ కార్మికులు నౌకాపరిశ్రమకు సాటిలేని త్యాగంతో సేవచేశారు. వారు అభ్యుదయ నిరోధకమైన అంతర్జాతీయ శక్తులప్రభావానికి ఎప్పుడూ లొంగిపోలేదు. అయినా వారి జీతాలు కనీసజీవాలూ గానే వున్నవి. వారిని ఇంకా తగ్గించివేయటం సబబుకాదు.

ముగింపుగా కార్మికుల శ్రేయస్సుకు భంగకరమైన ఎట్టివిధానాన్ని అవలంబించవద్దని యజమానులకు, ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాము. నిర్మాణశాలను లాభవంతంగా నడపటానికి, అంటే ఒక్క యజమానులకే కాక కార్మికులకు కూడా లాభవంతంగా నడపటానికి చేసే ప్రయత్నాలన్నిటికీ మేము హృదయపూర్వకంగా తోడ్పడగలం కూడా."

## సహకారోద్యమ ప్రయోజనం

### టి. యు. సి. ఎస్. భవన శంకుస్థాపనంలో గవర్నరు ప్రశంస

చెన్నపట్నం, డిసెంబరు 9 మదరాసు గవర్నరు భావనగరు మహారాజాగారు నిన్న సాయంత్రం తిరువళ్లిక్కేణి అర్బన్ కో ఆపరేటివు సొసైటీ ప్రధాన కార్యాలయపు భవన శంకుస్థాపనమును జరుపుతూ మదరాసు పౌరులకు సంఘముచేసిన అమోఘసేవను ప్రస్తుతించిరి. జాతి శ్రేయోభివృద్ధి కార్యములలో సహకారోద్యమమునకు గొప్ప ప్రాధాన్యముకలదని యిట్టి సొసైటీలు బీదప్రజలకు న్యాయమైన ధరలకు సామగ్రులను సప్లయిచేయుట విశేషముగా ఉపయోగపడగలవనిరి.

మేనేజింగ్ డైరెక్టరు శ్రీ యస్. కే. యజ్ఞనారాయణయ్యర్ గారు మదరాసుకు జపానుదాడి భీతియేర్పడిన సమయమున నగరము ఖాళీఅయినపుడు సొసైటీవారు ప్రభుత్వమువారి కోరికమీద సామగ్రి సప్లయిచేయుటకు పూనుకొన్నారనియు ప్రభుత్వఆదరవుతో ఆ స్కీమును సొసైటీ నిర్వహించిన కారణముగా రూ 3 లక్షలు లాభము చేకూరినదనియు ఆ మొత్తములో సగభాగమును ప్రభుత్వమువారు సొసైటీకి భవననిర్మాణమునకై గ్రాంటుచేసిరనియు మిగతా భాగమును కూడా యిప్పించుటకు గవర్నరుగారు ప్రయత్నించవలెననియు కోరిరి.

ఈ సందర్భమున గవర్నరు జనరలు కేంద్ర ప్రభుత్వ సభ్యుడు శ్రీ యన్ గోపాలస్వామి అయ్యంగారు మంత్రి శ్రీ యం. భక్తవత్సలంగార్లు విజయసందేశములను అందజేసిరి.

భవనగరు మహారాజాగారు శంకుస్థాపనోత్సవము జరుపుతూ 45 యేండ్ల క్రితమట స్థాపితమైన తిరువళ్లిక్కేణి సహకారసంఘము రాష్ట్రములో ప్రధాన సహకారసంస్థ అయి ప్రజాభిమానము బడసినందుకు సొసైటీని అభినందించిరి. సొసైటీవారు వెనుక చెన్నపురి ఖాళీ అయిన రోజులలో ప్రజలకు సామగ్రి సప్లయి చేసే విషయంలో చేసినసేవ అమోఘమైనదని కొనియాడిరి. సహకార సంఘములు ముఖ్యముగా బీదసాదలకు సరసమైనధరలకు పదార్థములను సప్లయి చేయగల లక్ష్యముతో పనిచేయుట అవసరమనియు తిరువళ్లిక్కేణి సహకారసంఘము ఉపద్రవ సమయములో అట్టి ఆదర్శముతో వ్యవహరించి సేవచేసినందుకు మెచ్చుకలసి యున్నదని నుడివిరి. భవన నిర్మాణమునకై సంఘమువారు ప్రభుత్వసహాయ్యము వాంఛించుచూ తెలిపిన కోర్కెను మంత్రులకు తాము తెలియజేయుదుమనియు ఆ విషయమును మంత్రులు సానుభూతితో ఆలోచించగలరనియు గవర్నరుగారు పలికిరి. భవనము నకు పునాదిరాయి వేసిరి.

డా॥ ఆదిశేషన్ గారు వందనములు తెలిపినతరువాత పాన్సుపారిపంచుటతో సభ ముగిసెను.

## "బియ్యం పొదుపుగా వాడవలెను"

### మంత్రి విన్నపం

చెన్నపట్నం, డిసెంబరు 8 రాష్ట్రములోను దేశములోను బియ్యము కొరతపడియుండే పరిస్థితిని ఎదుర్కొనుటకు ప్రజలు యితర ఆహారవస్తువులమీద ఆధారపడుటకు అలవాటుపడవలెనని మదరాసు ప్రభుత్వ ఆహారమంత్రి రోచ్ విక్టోరియా గారు నిన్న బ్రాడ్వేవద్ద పారుగూర్లబస్సులు నిలిచేస్థలమున రాష్ట్రీయ వినిమయదార్ల సంఘమువారు ఏర్పాటుచేసిన బియ్యము వాడనట్టి ఫలహారములశాల ప్రారంభోత్సవమునకు అధ్యక్షతవహిస్తూ నుడివిరి. ఈ ఫలహారశాల ప్రారంభోత్సవమును మేయరు డా॥ పి. వి. చెరియన్ గారు జరిపిరి.

శ్రీ పి యస్. భావ్యంచెట్టిగారు ఆహారమంత్రి, మేయరు యితర అతిథులకు స్వాగత మొసగిరి.

సంఘ కార్యదర్శి శ్రీ ఆర్. ఆర్ దళవాయిగారు దేశంలో బియ్యము కొరతగా నున్నందువల్ల ప్రజలు యితర ఆహారపదార్థములకు ఎక్కువ అలవాటుపడునట్లు ప్రచారముచేయుటకు యిట్టి ఫలహారశాలలు ఉపకరించునను ఉద్దేశ్యముతో సంఘమువారు వీటిని లాభాపేక్ష లేకుండా స్థాపించ దలచినారనియు, యీ శాల స్థాపించుటకు ప్రభుత్వము, కార్పొరేషను వారు చాలా సహాయ్య మొసగినందుకు కృతజ్ఞతలను తెలిపిరి.

మేయరు డా॥ పి. వి. చెరియన్ గారు క్యాంటీన్ను ప్రారంభిస్తూ ఫలహారశాల పారుగూర్లవారు వచ్చిపోయే స్థలములో నుండుటవల్ల బియ్యము ఉపయోగించని తినుబండారములు యితర పదార్థములనుండి యేవిధమున రుచికరముగా తయారుచేసుకొనవచ్చుననే విషయము ప్రచారముకావడానికి అవకాశమున్నదనియు నుడివిరి.

మంత్రి రోచ్ విక్టోరియాగారు దేశమునకు ఆహారపదార్థముల దిగుమతులు తక్కువైపోవుచున్నందున ప్రజలు గోధుమలు మొదలగు యితర ఆహారపదార్థములకు అలవడుట అవసరమనియు బియ్యము కొరతగా నుండుటచేత యిట్టి ఫలహారశాలలు నూలముద బియ్యము ఉపయోగించనట్టి యితర ఆహారవస్తువులను ప్రజలు వాడునట్లు ప్రచారము జరుపుట మంచిదనియు యీ విషయములో శ్రీ దళవాయిగారు చేయుచున్న కృషిని ప్రశంసించిరి. శ్రీ బి. రామకృష్ణగారు వందనములర్పించుటతో సభ ముగిసెను.







Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No. 7, Thambu Chetty Street, G. T. Madras